# సృజన

133 / 134
నవంబర్ / డిసెంబర్ 1982

ఆధునిక సాహిత్య వేదిక
మాసపత్రిక

ఉరిశిక్షాస్మృతిపై వట్టికోట ఆళ్వారుస్వామి కథ
నక్సల్బరీపై శంకరపిళ్ళై కవిత
ఏసియాడ్ వీధినాటకంపై సమీక్ష
బంగోరె సంస్మరణ

నిర్వహణ
'సాహితీ మిత్రులు'

సంవత్సర చందా రు. 20 ఈ సంచిక రు. 2

# సృజన

ఆధునిక సాహిత్య వేదిక

133/134 మాసపత్రిక నవంబర్/డిసెంబర్ 1982



నిర్వహణ

'సాహితీ మిత్రులు'

సంవత్సరచందా రు. 20 ఈ సంచిక రు. 2

SRJANA is commended for use in Public Libraries in the State by the Director of Public Libraries, Andhra Pradesh, Hyd.

Vide Ref. No. 182/A4/67, dated 22 9-1967.

Edited, Printed & Published by P. Hemalatha for 'Sahithee Mithrulu'

Printed at Navatha Printers J. P. N. Road, Warangal - 506 002

for Venkataramana Mudranalayam, Warangal

Working Editor: Varavararao

# 'బాతాఖానీ' క్లబ్బు ఎన్నికల్లో సినిమా రబ్బు

ఆంధ్రప్రదేశ్ అసెంబ్లీకి నిండా అయిదేళ్ళు నిండకముందే ఎన్నికలు ప్రకటించారు. ఎన్నికల రాజకీయాలకు బయట ప్రజాసమస్యల పరిష్కారంలో నిమగ్నమై ఉన్న కామ్రేడ్ పరిటాలహరిని అనంతపురంజిల్లా ధర్మవరంలో పోలీసులు కాల్చివేసారు. గిరిజనులను రైతుకూలీ సంఘంలో సంఘటితం చేస్తున్న చైతన్యవంతులైన కొండజాతి యువకులను ఇద్దరిని కొండమొదలులో పోలీసులు కాల్చేసారు. వరంగల్ నగరంలో శివనగర్, కాశీబుగ్గ, గిర్మాజీపేట, మచిలీబజారు, కుమార్‌పల్లిలపై ఇళ్ళమీదదాడులు, విధ్వంసం, అరెస్టులు, చిత్రహింసలు, సోదాలపేరుతో, పెట్రోలింగు పేరుతో పెచ్చెరిగిపోవడం ఇమ్మడి ముమ్మడిగా పెరిగిపోయింది. మరొకవైపు దొంగతనంగా బట్టీలుపెట్టి కాపుసారా అమ్ముకుంటున్నారన్న నెపంతో లంబాడీ తండాలపై, గూడేలపై సారాకంట్రాక్టర్లు, ఎక్సైజ్ పోలీసులు, పోలీసులు దాడిచేసి స్త్రీలపై వృద్ధులపై, పిల్లలపై అత్యాచారాల కళ్ళాలువదులుతున్నారు. ఇవేవీ ప్రజాసమస్యలు కానట్టు ప్రతిపక్షాల ఉష్ట్రపక్షులు మళ్ళీ ఒకమారు పూర్తిగా ఎన్నికల ఇసుకలో తలదూర్చి పార్లమెంటరీ దుర్గంధాన్ని కెలుకుతున్నాయి.

"తెలుగుదేశం" సినిమా విడుదల కాకపోతే ఈసారి ఎన్నికల సినిమాహాళ్ళు ఎన్నివోట్లు కలెక్టుచేసేవో, ఎన్నికల డబ్బాలు బాక్సాఫీస్ హిట్ అయ్యేవో, ఫ్లాప్ అయ్యేవో ఇప్పుడు చెప్పడంకష్టం. కాని పాలకవర్గాల నినాదాల జానపద బాణీలు, అభివృద్ధి పథకాల మేకప్పు ఇందిరా దర్శకత్వంలో ఆకర్షణ రంగువెలసిందనేది యదార్థం. ప్రతిపక్షమే లేని ఏకైకపక్షంగాఉన్నా కాంగీ నాలుగుసార్లు ముఖ్యమంత్రులను మార్చి పోలీసు కానిస్టేబుళ్ళు కూడ గుర్తించలేని ప్రవాసపించను దారును గద్దెమీద కూలేసిందంటేనే ప్రజలకు పార్లమెంటరీ రాజకీయాలమీద, పార్లమెంటరీ రాజకీయాలను ఢిల్లీ యాత్రలుగా, ఇందిరా రాజీవ్‌లతో మంతనాలుగా మార్చేసిన పెద్దింటి పెత్తనం మీద ఎంతరోతపుట్టిందో అర్థమవుతున్నది. అంటే ఇంక పాలకవర్గాలు రోత, అసహ్యం, అవినీతి, ఆశ్రితపక్షపాతం, అసమర్థతలకు పర్యాయపదాలైపోయిన పార్లమెంటరీ రాజకీయపార్టీలకు అన్నిటికీ ప్రత్యామ్నాయంగా ఒక కొత్త ఆకర్షణీయమైన ఆమోదాంశాన్ని (లెజిటిమెసీని) ప్రవేశపెట్టకపోతే ఇందిరా కాంగ్రెస్ ఓటమి అలా ఉంచి, అసలు పార్లమెంటరీ వ్యవస్థకే ప్రమాదం వచ్చే పరిస్థితులు కనిపిస్తున్నాయి. రాజకీయ హీరోలందరూ నీరోలుగానో, జీరోలుగానో స్థిరపడిపోయారు. గాంధీ నెహ్రూల హీరో వారసత్వాలు చెల్లేలాలేవు. ఇంక మిగిలింది సామ్రాజ్యవాదం టెక్నిక్‌తో వెండితెరలపై ఆదర్శాలకు మారుపేరుగా వెలుగుతున్న సినిమా హీరోలు, అత్యాధునిక వేషంలో అచ్చమైన ఫ్యూడల్ ప్రభువులు. కొనఊపిరితోఉన్న పార్లమెంటరీ రాజకీయాలకు సినిమా డైలాగులతో మేకప్పులతో, ఫ్లడ్ లైట్లతో కొత్త ఊపిరి పోయగలమేమోనని వస్తున్నారు. మాజీ. రాజీ నక్సలైట్లు మొదలుకొని మాజీ ఐజీలదాకా, కులసంఘాలు మొదలుకొని కులనిర్మూలన సంఘాలదాకా నీరాజనాలు ఎత్తు

జైలులోపల :

# పతితుని హృదయం

వట్టికోట ఆళ్వారుస్వామి

"అంతా వచ్చారా? ఏం, మగ్గాల చప్పుడు కావడం లేదే?" అంటూ అధికారధ్వనిలో దఫేదారు తిరుపతయ్య నేతశాలలో ప్రవేశించి లోపలనున్న ఖైదీలను లెక్కించ సాగాడు.

అక్కడక్కడ ఇద్దరు,ముగ్గురు కూడి, ఆనాడు ఉదయం ఉరి తీయబడ్డ వ్యక్తి గురించి మాట్లాడుకుంటున్న ఖైదీలు తిరుపతయ్య రాగానే తమ స్థానాలలోకి వెళ్ళి కూర్చున్నారు.

"గండయ్య రానట్టుందే?" తిరుపతయ్య ప్రశ్నించాడు.

"రాలేదు సార్" ఒక ఖైదీ జవాబిచ్చాడు

"ఎంత చెప్పినా వాడికి బుద్ధిరాదు, ఎప్పుడూ ఎక్కడో తిరుగుతుంటాడు. ఎక్కువ శిక్షవాడని నేను కొంచెం చనువుగా మెదులుతుంటుంటే అధికారులతో నాకు మాట తెచ్చేలాగున్నాడు." అంటూ నేతశాల వదిలి "మగ్గాలు ఆడనివ్వండి" అని ఆజ్ఞాపించి గండయ్య కొరకు బయలుదేరాడు తిరుపతయ్య.

తిరుపతయ్య అటుపోగానే ఖైదీలు మళ్ళీ మాటల్లోపడ్డారు.

"చూచావురా! తిరుపతయ్య ముఖంలో ఇంతన్నా విచారముందో!"

"విచారమెందుకురా వాడెవడు, పీడెవడు?"

"పాపము! ఉరితీసిన సంగతి అతని వాండ్లకు తెలుపుతారో, లేదో"

"తెలిసికొని మాత్రము ఎవరు ఏం చేస్తారు? వచ్చిన దగ్గరకు చేరుకున్నాడు"

"అది కాదుకాని, ఓ మనిషిని ఇంకో మనిషి చేతులుకట్టి, ఉరిపెట్టి వ్రేలాడ తీస్తే చచ్చిందాక గుడ్లుమిటకరిస్తూ చూడటానికి అక్కడ నిలుచున్న వాండ్లకెట్లా మనసొప్పిందో? నాకైతే అతని పీనిగెను చూడటానికి కూడ మనసొప్పలేదురా!"

"ఏమి వగలమారి మొగోడివిరా. రేపు నీకు జవాను కొలువిచ్చి ఉరితీయమంటె తీయక ఏంచేస్తావు? ఖానూను ప్రకారం ఎవరైనా చేయాల్సివస్తుందోయ్! ఖానూనంటే ఏం పిల్లకాయలాటనుకున్నావా?"

---

కున్నారు. కనుక సమస్య ఇందిరా కాంగ్రెస్ గెలుపు ఓటమిలదికాదు. సమస్య పార్లమెంటరీ రాజకీయాల లెజిటమెసీ (సంబద్ధత)ది. ఏవేషంకట్టి వచ్చినా ప్రజా రాజకీయాలపై కత్తి కట్టడానికే పార్లమెంటరీ వొత్తినెగదోస్తున్నారనేది వర్గపోరాట చైతన్యంలో రాటుదేలుతున్న ప్రజలు గ్రహిస్తారు, చైతన్యపరిధిలో ఎన్నికలను బహిష్కరిస్తారు.

డిసెంబర్ 4, 82

— సంపాదకుడు

ఈ విధంగా ఖైదీలు చర్చించుకుంటూండగా తిరుపతయ్య గండయ్యను వెంట బెట్టుకొని నేతశాలకువచ్చి, మగ్గాలపని ఆగి ఉండుటనుచూచి "మీకేమైంది ఈ రోజు పని బొత్తిగా చేయడంలేదు. చెప్తున్నాను బాగావినండి, మీ అందరిని దొర దగ్గరకు తీసికెళ్ళి నిలబెడ్త." హెచ్చరించాడు తిరుపతయ్య.

తిరుపతయ్య వెనుక నిలబడి విచారంతో తలనేలకువేసిఉన్న గండయ్య "దొర దగ్గరికెందుకు ? ఉరి దగ్గరికి తీసుకెళ్ళరాదు ?" అంటూ కండ్లనీరు తుడుచుకున్నాడు.

గండయ్య కంటినీరు చూడగానే తిరుపతయ్య చలించిపోయాడు. "ఈవాళ గండయ్య నాటక మాడుతున్నాడే. అడదానిలాగ ఏడ్వటం మొదలుపెట్టాడు, ఒకసారైనా వాడి ముఖం చూచావో లేదో వాడు చస్తే చుట్టం చచ్చినట్టు ఏడుస్తావెందుకు?" తిరుపతయ్య టోపి క్రిందబెట్టి బీడీ కాలుస్తూ అడిగాడు.

"మా ఖైదీలకు చుట్టాలము మేము కాకపోతే నీవవుతావా? తిరుపతయ్యా ! పిల్లలు గలవాడిది, సంసారం చేస్తున్నావు కూడ. 25 ఏండ్ల వయసు కుర్రోడ్ని పెండ్లికొడుకోలె పట్టుకెళ్ళి స్తంభాని కేలాడదీయడానికి నీకు చేతులెట్లా వచ్చాయి ? నీకు కోపమొస్తె మానెగాని నీవు మనిషివికావయ్యా !" అని గండయ్య గంభీరంగా అన్నాడు.

"పిచ్చోడా నేను కాకపోతే ఇంకోడు తయారవుతాడు ఈ పనికి. ఉరితీయడానికి మనుషులు లేక ఉరితీయడం ఆగిపోతుందనుకున్నావా ?" తిరుపతయ్య నిర్లక్ష్యంగా జవాబిచ్చాడు ముసిముసిగా నవ్వుతు.

"నీ సంగతే కాదు నేను అనేది ఉరితీసే వాండ్లగురించే అడుగుతున్నాననుకో. ఎవడు తీశాడో ఈ పద్ధతిగాని ఉరితీసిందానికంటె 50 ఏండ్లో 60 ఏండో జైల్లో ఉంచింది మంచిది." గండయ్య అన్నాడు.

"లేకుంటే నీ పద్ధతి అంటే, నీ గ్యాంగు పద్ధతితో చేస్తే యింకా బాగుంటుందిరా ? అంటూహేళనగా నవ్వాడు తిరుపతయ్య.

"తిరుపతయ్య సార్ ! మాకంటే నీవు మెరుగని సంతోషిస్తున్నావ్ ? నీవేమైనా అనుకో, మనసుమంచి అనేస్తున్నాను. మేము తప్పుచేస్తే జైలుశిక్ష వేసిన వాండ్లు ఒక మనిషిని ఉరితీసినవాడికి కూడా కఠినశిక్షవేస్తె బాగుంటుంది" గండయ్య కోపంతో అన్నాడు.

"నేను ఖానూను ప్రకారము ప్రభుత్వ ఆజ్ఞతో ఉరితీశాను తెలుసా ! నన్నెవరు శిక్షిస్తారు ? సరే కాని, మాటలు చాలా అయినవి. యికపోయి మగ్గముమీదకూర్చోపో. దొర వచ్చేవేళైంది." అంటూ తిరుపతయ్య డ్రెస్ సదరుకొంటు గేటువద్దనిలుచున్నాడు.

"నేను ఇవాళ దొరను కూడా అడుగుతా ఏమైనగాని ఇంత అన్యాయంగా ఉరితీయడం బాగలేదని." అని గండయ్య కూడా తిరుపతయ్య పక్కన నిలుచున్నాడు.

తిరుపతయ్య కోపంగానటిస్తు "ఒరే! నీకు సిగ్గెందుకులేదు నీవు మీగ్యాంగు వాళ్ళు కలిసి ఎంతమంది ప్రాణాలు తీసారురా? ఎంతమంది పెండ్లిండ్లను ఎత్తగొట్టారురా? ఎన్ని కొంపల్ను నాశనం చేశారురా? అటువంటి నీవు ఎవరినో ఉరితీసినందుకు ఏడుస్తున్నావు? ఏమేమోవాదిస్తున్నావా? పైగా దొరను అడుగుతాడట దొరను ఎప్పుడైతివి పత్తిత్తువు" అని గట్టిగా మందలించాడు తిరుపతయ్య.

గండయ్య కడుపులోని దుఃఖము ఇప్పుడు రౌద్రి రూపము దాల్చింది. తానొక కేదీనని, అధికార సిబ్బందిలోని ఒక వ్యక్తితో మాట్లాడు తున్నాననే సంగతే మరిచిపోయాడు. ఉగ్రుడై "మాటిమాటికి మాతో పోల్చుకోవడానికి నీకు నోరెట్లావస్తుంది. తప్పతాగి, ఉడికీ ఉడకని మాంసము తిని. బజారు ముండలతో కాలము గడిపేమేము ఒళ్ళు మరిచి ప్రాణాలు తీశాం. దార్లు కొట్టి పెండ్లి పిల్లలపై నగలు అపహరించాం. ఇండ్లలో జొరబడి దోచుకున్నాం. మత్తుదిగింతర్వాత ఒక్కొక్కప్పుడు మా చేష్టలకు మేమే పశ్చాత్తాపపడ్డాం. మేము చదువురాని మొద్దులం. మాలో చదివినోడుగాని. మంచిచెడ్డ తెలిసినోడుగాని ఒకడుండడు చిన్నప్పటినుండి దొంగల సావాసంలో పెరిగాం. వాండ్లలో తిరిగాం, అవేబుద్ధులు, అదేబతుకు.

ఇప్పటికైనా మమ్ముల ఈ పనినుండి మాన్పించి మంచి విద్యావంతులుగా బుద్ధిమంతులుగా తయారుచేయడానికెవరైనా ముందుకొస్తే మా గ్యాంగు మాటేమోగాని నావరకు నేను సిద్ధంగా ఉన్నాను.

మరి నీ సంగతేమంటావు? ఏదో ఖానూను ప్రకారమని అన్నావే. చదువుకున్న పెద్దలు, మావంటి వాండ్లను జేల్లోపెట్టి బాగుచేయతలచుకున్న పెద్దలు, మనిషిని చంపేదానికి ఖానూనువ్రాస్తే వాండ్లనుండి మావంటివాండ్లు ఏం నేర్చుకోవాలె? ఒకడు మనిషిని చంపడమే తప్పు అంటున్నఖానూను, ఇంకొకడిని ఉరితీసి చంపమని ఎట్లా అంటుంది? తిరుపతయ్య సార్!" గండయ్య గుడ్లెర్రజేసి గట్టిగా అడిగాడు.

తిరుపతయ్య వింతగా గండయ్యవైపుచూస్తూ "ఒరే! నీకు పిచ్చిలేసేటట్టున్నదిరా పో! లోపలికిపో! దొరవస్తున్నాడు" అంటూ తిరుపతయ్య క్రమశిక్షణతో నించున్నాడు. గండయ్య కూడా దూరంగా నిలుచొని జేలరువైపు చూస్తున్నాడు.

జేలరు, జేలర్ వెంట జమేదార్ గేటులోపలికి ప్రవేశించగానే జమేదారు రౌద్రముతో గండయ్య నుద్దేశించి "ఏమిరా? నీవు ఈరోజు గంజి తీసుకోలేదేం?"

గండయ్య జేలరుకు దండంపెట్టి "అయ్యా? ఉసితీసినప్పటి నుండి నాకు కడుపులో ఎట్లాగోఉంది. నాకెటూ తోచడంలేదు. మీరు చదువుకున్నోరుగూడా ఇటువంటి పనులుచేస్తే ఇక మా సంగతి ఎవరు అడుగాలె" అని గండయ్య ప్రశ్నించాడు.

జమేదారు అధికారధ్వనిలో "నీవు గంజి తాగుతావా లేదా?" అని గర్జించుతు ఓరకంటితో జేలరువైపు చూచాడు.

(మిగతా 74వ పేజీలో)

మలయాళీ కవిత :

# బెంగాల్

కె. జి. శంకరపిళ్ళై

భారత వర్తమానం
ధృతరాష్ట్రి ఆవేదన!
బెంగాల్ నుంచి వార్తలులేవు
బెంగాల్ నుంచి మాత్రమే వార్తలులేవు
అసలేలేవు
లేనేలేవు

నా పిల్లలూ, నా పిల్లల పిల్లలూ
నా రక్తసంబంధీకులూ
అందరూ అక్కడే ఉన్నారు
ఎన్నెన్నో రకాలవాళ్ళు
డబ్బున్నవాళ్ళు
ప్రతివాడికీ ఓ బావిఉంది
పంటలున్నాయి, పండుగలున్నాయి, చుట్టాలున్నారు
సరిహద్దులున్నాయి
ఇరుగు పొరుగులున్నారు
ఈర్ష్యలున్నాయి
మంత్రతంత్రాలున్నాయి
ఆ సరిహద్దుల వెంట
మోసం నిండిన బొరియలున్నాయి
ఆ బొరియల్లో ప్రతీకారం పొంచిఉంటుంది
వాళ్ళు తప్పుచేసిన పిల్లితల నరికేసి
రాత్రింబవళ్ళూ మంత్రాలు వల్లిస్తూ
దాన్ని వెల్వెట్ గుడ్డలోచుట్టి బావిలో పడేస్తారు
వాళ్ళు ప్రతిదాంట్లోనూ విడిపోయిఉన్నారు
కుంతలూ, మూకుళ్ళూ, గాదెలూ, విసుర్రాళ్ళూ
పురాతన గృహాల పునాదులూ
కులదేవతల విగ్రహాలూ

బాటలూ నదులూ పల్లెలూ పట్నాలూ దళాలూ-
అన్నిటినీ వాళ్ళు పంచుకున్నారు
నిలువునా రెండుముక్కలుగా చీలిపోయారు
ప్రతిదానికీ పోట్లాటే, రక్తం చిందించుకోవడమే!
పాచికల దగ్గర మోసం చేస్తారు
మారువేషాల్లో వెళ్ళిపోతారు
వాళ్ళ నాలికలెప్పుడూ రక్తదాహంతో ఉంటాయి
వాళ్ళ మాటలనిండా విషంపూసి ఉంటుంది
వాళ్ళందరూ పార్టీ మనుషులు, గాంధేయులు కూడా-
నా పిల్లలూ, నా పిల్లల పిల్లలూ
నా రక్తసంబంధీకులూ........
ఓ! సంజయా! నీ దీర్ఘాలోచన దేనికి?
బెంగాల్ నుంచి వార్తలులేవు

అక్కడి సంగతేమీ తెలియడం లేదు
రాత్రి వేకువ పగలు సాయంత్రం రాత్రి వేకువ
పగలు సాయంత్రం రాత్రి రాత్రి-
నేనిట్లాగే కూచుంటాను

ఏమీ, ఏమీ తెలియదు

వెండికరవాలం ధరించి, రాజాజ్ఞలు పట్టుకొని
ఏ అపరాత్రో పరుగెత్తుకొచ్చే గుర్రపురౌతు కానరాడు
వాకిలిగుండా ఎవరూ అడుగులో అడుగేసి నడవరు
విన్నపాలేమీ లేవు, ఉత్తర్వులేమీ లేవు

సైనిక వందనాలేమీ లేవు, విజయోత్సవాలేమీ లేవు
ఇదెంత మాత్రమూ గతకాలం కాదు
ఈ రోజుల్లో రాజీలేనే లేదు
రక్తానికి రక్తం, తుపాకికి తుపాకి
ధైర్యానికి ధైర్యం-గతకాలమెప్పుడో గతించిపోయింది
ఇదంతా మండే ఎండకాలం

ఇది నిజంగా కలియుగం
బహుశా ఆ కవి చెప్పిన

క్రూరాతి క్రూరమైన కాలం ఇదేనేమో?

ఓ సంజయా
లోపల గదిలో ఎవరో నిట్టూరుస్తున్నారు
దూరానెక్కడో ఎవరో ఏడుస్తున్నారు
భయం

భూమ్యాకాశాలలో భయం ధ్వనిస్తోంది
సంజయా నీదీర్ఘాలోచనదేనికి?
ఏవో అస్పష్టధ్వనులు ఒంటరితనాన్ని రేపుతున్నాయి
సంజయా నువు నెమరేసేవేమిటి?
మౌనం నిన్నుఎక్కడో దూరదూరాలకుతీసుకుపోతోంది
బెంగాల్ చుట్టూ మహాసముద్రాలున్నాయి
నదీలోయ సంస్కృతులున్నాయి
నగర నాగరికతలున్నాయి
దొరలూ, బానిసలూ, శతాబ్దాలూ
మదమెక్కిన ఖండాలూ
మహాయుద్ధాలూ తుపానులూ
కొండలమధ్య గడ్డకట్టుకుపోయిన పొడవాటి చీకటిదారులూ
చిరునవ్వుల వెనుక దాగినకోరలూ
అన్నీ ఉన్నాయక్కడ
నా పిల్లలూ, నా పిల్లల పిల్లలూ
నా రక్తసంబంధీకులూ - అందరూ అక్కడే ఉన్నారు

ఈ మహ పీడకలల వక్రరూపాలన్నీ
అక్కడే ఉన్నాయి
దూషణలూ విచారణలూ శిక్షలూ
సైబీరియా ప్రవాసాలూ
ఉరికంబాలూ డాక్టర్లూ తలారులూ
ప్రళయం, నోవా,[3] మనువూ-అందరూ అక్కడేఉన్నారు
బెంగాల్ రహస్యాలు నాకు నిరాశగొలుపుతున్నాయి
ఏమీ తెలియడం లేదు

సంజయా ఈ శరద్రుతువు-
సరిగ్గా ఈ కాలమే

లోయలనిండా చెట్లకుదుళ్ళనిండా
ఎండుటాకులు కుప్పకూడుతాయి
ఈ మండే గ్రీష్మం
నన్నొక తెలియని భయంతో నింపేస్తుంది
ఆ ఆకుల కిందెప్పుడూ
పాములే ఉండనవసరం లేదు
కసుక్కున దిగే కొయ్యలే ఉండనవసరంలేదు
ఎండుటాకే
ఆకలికి మాయలమారి పెద్దమ్మ
అది
ఆపదలకుప్పను బయటికి వదులుతుంది
అదిప్పుడు పొంచిపడున్నది
కానీ ఒకచిన్న గాలిపరక వీచినా
ఈ ఎండుటాకులే గర్జిస్తూ లేస్తాయి
ఎవరూ గమనించరు
అవి మెల్లగా
మహాభయంకర తుఫానుల గొలుసులు విప్పుతాయి
ప్రతివాన్నీ నాశనం చేస్తాయి
చూడు! అవి ఆ మురుగ్గుంటల్లో ఎట్లాపడున్నాయో!
అట్లా చెల్లాచెదరుగా ఏమీ ఎరగనట్టు పడున్న
ఆ ఎండుటాకుల్ని ఎన్నడూ నమ్మొద్దు

ఎవరూ తెలుసుకోని అ తుఫాను
ఎగసి దారికడ్డంవచ్చే మహాపర్వతాల్ని పెళ్ళగిస్తుంది
ఈ గ్రీష్మపు భయంకర రహస్య స్వప్నం
నాకు స్పష్టంగా తెలుస్తోంది
అది ఈ భూమిని బీడుభూమిగా మార్చేస్తుంది
వికారంగా, విష్ఫలంగా మార్చేస్తుంది
భూము నెర్రెలువాస్తుంది
ఉడుకెత్తిపోతుంది
నిశ్శబ్దమైపోతుంది

నివ్వెరపోతుంది
పుణ్యాత్ముల ఆత్మలన్నీ గాభరాపడతాయి
వాళ్ళకళ్ళకు నల్లగంతలు కట్టబడతాయి
వాళ్ళు మళ్ళీ మళ్ళీ చావుగీతం పాడుతుంటారు
వాళ్ళు సిసీఫస్[4] నుంచి రాయినందుకుంటారు
అంతా మిథ్య మిథ్య అని
వాళ్ళు పిచ్చిపురాణాల్లోంచి ఎలుగెత్తి అరుస్తారు

సంజయా
నువు చూపించే వాస్తవం
ఈ నెర్రెలు నిర్వాసితుల ఆశ్రయాలు కావు
పరాజితులకోసం భూదేవి తెరిచిపెట్టిన సమాధులుకావు
ఈ నెర్రెలకు చెవిపెట్టి ఆ నల్లపిల్లలు
పదే పదే బరువైన అడుగుల చప్పుడు వింటున్నారు
అది చరిత్ర పదఘట్టన
అది లోలోతుల్నుంచి ఎగసివచ్చే
తుఫాన్ల అడుగుల చప్పుడు
కళ్ళలో మెరుపులు మెరిపించే
డ్రాగన్ అడుగుల చప్పుడది
ఔను నువు చెప్పింది చేదునిజం
ఈ యువకుల నూత్నగీతాల నిండా అగ్నిఉంది

ఈ మండే ఎండాకాలం నన్ను తినేస్తున్నది
ఆకులుమామూలుకంటె రెట్టింపువేగంతో రాలుతున్నాయి
భయంగొలిపే గాలిదుమారం ఉవ్వెత్తున లేస్తోంది
ఆ సన్నటి ఎండిన కొమ్మలకింద
శిఖరాల కెక్కుపెట్టిన ఎండుటాకులు
ఎప్పటికంటె ఎక్కువశక్తి పొందుతున్నాయి
ఈ బయటిక్కనబడే అమాయకరూపం
ఎప్పుడూ, ఎప్పుడూ నమ్మేది కాదు
ఇదివరకు నువ్వే చెప్పినట్లు

ఇది రహస్యంగా అడుగునుంచి పైకెగుస్తుంది
మనక్కనబడే అడుగులకిందా, దాటలకిందా
మన పత్రికాశికల కిందా అంచనాల కిందా
ఒక నూత్న చైతన్యం లాగ
లోతైన చైతన్యం లాగ
అది ఉప్పొంగుతుంది
అది రహస్యంగా ఉప్పొంగుతుంది
ఓ నాకెంతో భయమవుతున్నది
నా పిల్లలూ, నా పిల్లల పిల్లలూ
నా రక్త సంబంధీకులూ-అందరూ బెంగాల్‌లో నేఉన్నారు
అక్కడి నుంచే ఏమీ తెలియడం లేదు

ఒకానొకప్పుడు
ఉత్తములైన మహారాజాల గుంపొకటి
ఓ యాత్రనుంచి ఆనందంగా కథలు చెప్పుకుంటూ
తిరిగొస్తూ సందడిగా కాళీఘాట్ దాటుతోంది
అప్పుడే అకస్మాత్తుగా వీధిలో తుఫాను చెలరేగింది
వీధిపక్క కాలవలో మొదలైన ఆ తుఫాను
రిజర్వాయర్‌లనూ రేడియో స్టేషన్‌లనూ
ఆస్పత్రిలనూ, వీధులనూ
మొత్తం నగరాన్నే ధ్వంసంచేసింది
చక్రవర్తి హీరాలాల్‌ను
మహాఘనతవహించిన సింహాసనంతోసహా ఊడ్చుకు పోయింది
తుఫాను శాంతించినాక
సామ్రాజ్యపు వేళ్ళూ, కొమ్మలూ మారిపోయాయి
ప్రభుత్వాలూ, చట్టాలూ, అలవాట్లూ, ఆచరణలూ
ఆఖరికి పగళ్ళూ రాత్రిలూ కూడా కొత్తవై పోయాయి

నిజంగా తుఫాను
మారుమూలగ్రామాల నిరుపేద రైతుల

పదునైన శాపాల్లో పుట్టిందనీ
అంతేకాదు
తుఫానులట్లానే వస్తాయనీ
చివరికి మాత్రమే
కొందరు పెద్దలు అర్థంచేసుకోగలిగారు
అప్పుడు కవులూ మేధావులూ
దానిగురించెంతో రాశారు
చివరికి
నగరానికి దూరంగా అడవుల్లో
ముళ్ళచెట్లమీద కొందరు ఘనతవహించినమహారాజుల
శవాలు చిక్కుకుపోయి కనబడ్డాయి
చక్రవర్తి తల
పవిత్ర గంగానదిలో
ఒక జాలరివలలో దొరికింది

సంజయా నాకిప్పుడెంతో విచారంగావుంది
ఇవాళ నా పిల్లలూ, నా పిల్లల పిల్లలూ
కాళీఘాట్‌గుండా యాత్రకుపోవచ్చు
సంతోషంగానే తిరిగిరావచ్చు
ఏం జరగనున్నదో ఊహించడంకూడా
నాకసాధ్యమవుతున్నది
ఈ ఆకురాలుకాలం నన్నెప్పుడూ సంతోషపరచదు
ఎవరో పరుగెత్తుకొస్తారనీ
చావువార్త తెస్తారనీ
నా పిల్లల చావువార్త తెస్తారనీ
ఆలోచన నన్నెల్లప్పుడూ వేటాడుతున్నది
నేనేమో ఈ మండేసూర్యునికింద కట్టుబడిపోయాను
నా స్వేచ్ఛంతా దొంగిలించబడింది
సంతోషం అనుభవించడానికూడా
నాకిప్పుడు శక్తిలేదు
ఇది ఒక బీడుభూమి

ఇక్కడ ప్రతిదీ తెలియనిదే
ప్రతిదీ భయంగొలిపేదే
చీకటిని వివరించడం కంటె
ఈ వేడి సూర్యుణ్ని, ఈ మండే సూర్యుణ్ని
వివరించడం కష్టం
ఇక్కడ ప్రతి అణువూ ఒక్కో ప్రత్యేక సూర్యగోళంగా ఎదిగి
నాకోసం చితి పేరుస్తుంది

సంజయా
ఈ రోజుల్లో నేను హఠాత్తుగా
నీ మాటలు మరిచిపోతున్నాను
ఇదివరకంటె ఎక్కువగా
దూలంమీది మంచిపలికే ప్రవక్త మాటలు
బల్లికూతల జోస్యం వింటున్నాను
ఈ ప్రవక్తకు
ధృవాలలోతుల రహస్యాలు ముందే తెలుసు
వాటి విషాద సందర్భాలు కూడా తెలుసు
అందుకనే అది
అన్ని పరిస్థితుల మార్పుల మధ్యా
తనను తాను ఏకాగ్రధ్యానంలో బంధించుకుంది
అంతులేని ప్రవచనాలవి
వాటిని నేనిదివరకంటే ఎక్కువగా ఇష్టపడుతున్నాను
వాళ్ళపాటలతో మంటల కాగడాలు తయారుచెయ్యమనీ
రాజుల మొఖాలమీద వాటితో పొట్లుపొడవమనీ
నిన్న సాయంత్రం కవులకు మవ్విచ్చిన ఉపన్యాసం
నే విన్నాను

సంజయా
ఈ ఎండాకాలంలాగ
ఈ ఆతురాలు కొలపు దుష్టసమయాల లాగ
ఒక తీవ్ర సంక్షోభం లాగ

నన్నెప్పుడూ పొడుస్తూఉండే
నీ చేదువిజాల జాజ్వల్యమానమైన కాంతికన్న
మహాశక్తివంతంగా
ఈ పవిత్రవచనాల మసకే
నన్నిప్పుడు విలువునా ఓడిస్తున్నది
ఉద్రిక్తంకాని ఈ నిశ్శబ్దమే
నన్నిప్పుడు విలువునా ఓడిస్తున్నది
మన బాంధవ్యాల వేళ్ళు ఎక్కడో తెగిపోయాయి
నా చూపు మసకేస్తున్నది
నేనిక్కడ్నుంచి చూడగలిగిందెంతో తక్కువ
ఈ రైలుపెట్టెలోపలి దృశ్యమే నాక్కనబడుతోంది
ఈ కుడివైపు కిటికీలోంచి
మృత్యువు విండిన పర్వతశ్రేణులు మాత్రమే కనబడుతున్నాయి
దావానలంలో సజీవంగా దహనమైపోయిన
మేకలమందల, సెలయేళ్ళ
బక్కచిక్కిన, పదునైన అస్థిపంజరాలు మాత్రమేకనబడుతున్నాయి
యుద్ధశిధిలాల మధ్య నుంచి
కూలిపోయిన వంతెనల మధ్యనుంచి
నాశనమైన ఇళ్ళమధ్యనుంచి
ఒకపక్షం సైనికులు మాత్రమే కనబడుతున్నారు
తెగిపోయిన, చేతులూ కాళ్ళూ మాత్రమే కనబడుతున్నాయి
చనిపోయి వాచి బయటికి పొడుచుకొస్తున్న కన్నుమాత్రమే
అశోకచక్రంలాగ కనబడుతోంది
తెగిపోయి విసిరేయబడ్డ గుర్రం తల మాత్రమే కనబడుతోంది
వెనుకనుంచి వికారంగా గాంధీటోపీ మాత్రమే కనబడుతోంది

ఎడమవైపు కిటికీలోంచి
ప్రతిరోజూ మృతదేహాలు కొట్టుకొచ్చే
దిక్కుమాలిన తీరాలు మాత్రమే కనబడుతున్నాయి
అఘాతం మాత్రమే కనబడుతోంది
చీకటి లైట్‌హౌస్ మాత్రమే కనబడుతోంది

తప్పిపోయిన కాపలాదారు మాత్రమే కనబడుతున్నాడు
ప్రాచీనకాలపు ఒంటరి నావికుడు మాత్రమే కనబడుతున్నాడు
ఈ కళ్ళుచిట్లిపోయే ఎడారిలో
నా ఒంటె భయంగా తలెత్తి
దూరతీరాలకు నడవడం కనబడుతోంది

ఓ! సంజయా
నాకింతకంటె ఎక్కువ చూపానడం లేదు
నువు చెప్పే
ఆకలి అరదండాలు నాక్కనబడ్డంలేదు
అరిచేతుల్లో కాసిన కాయలు తుడిచేసిన
అదృష్టరేఖలు నాక్కనబడడం లేదు
ఖాళీ అల్యూమినియం పళ్ళెం నాక్కనబడడంలేదు
వాతలుతేలిన నా తాతవీపు నాకు కనబడడంలేదు
నా బరువైన పాదాలు తొక్కేస్తే, నలిపేస్తే
పొడుచుకొచ్చాయని నువు ఎప్పుడూ తిడుతూఉండే
పక్కటెముకలు నాకు కనబడడంలేదు
వెంపలమీద నుంచి వెనక్కిచూస్తోన్న
కన్నీళ్ళు నాక్కనబడడం లేదు
ఓ- ఏమీ కనబడడంలేదు నిజంగా ఏమీలేదు
నాకేమీ కనబడడంలేదు, ఇది నిజమే
దూరంగా నేను వాటిని తలచుకున్నప్పుడు
నా ఎదమీద మంటలు చురుక్కుమంటాయి
అవన్నీ ఎండుటాకులు
ఈ డ్రాగన్లు భయంకర తుఫాన్లకు దారినిస్తాయి
అవి నా పిల్లలను ముళ్ళచెట్లమీద ఇరికిస్తాయి
ఆఖరికి నా తల కూడా
ఒక జాలరివలలో దొరుకుతుంది
ఓ సంజయా-
గుడ్డితనమింకెంత మాత్రమూ
శక్తివంతమైన కవచం కాదుసుమా

సంజయా
నా కిప్పటికీ ఓ అనుమానం వేస్తుంది
చూడక్కడ
పల్లెలమీద సుడిగాలిలా తుఫాను చెలరేగుతోంది
ఆ ముసలి మంత్రిగత్తె పక్కటెముకల్తో
ఎండుటాకులు తిరగబడుతున్నాయి
అవి ఒకప్పుడు రాలినవీ, చెల్లాచెదరయినవీ
ఇప్పుడు మళ్ళీ తుఫాను కొమ్మలమీద
వికసిస్తున్నాయి
మంటలుగా పుష్పిస్తున్నాయి
శీతావహపు సుడిగుండాలు రేపుతున్నాయి
డ్రాగన్ వృక్షాలుగామారి
భయంకర విధ్వంస ఫలాలను కాస్తున్నాయి
అవి చట్టాలను ధిక్కరించి
ప్రభుత్వ కాలయంత్రాంగాన్నంతా నాశనం చేస్తాయి
అవి చెరసాలల్ని బద్దలుగొడతాయి
అవి
పాత విచ్చెన్లనీ,
రహదార్లనీ, ఆనకట్టల్నీ, రైలుమార్గాల్నీ
నదుల్నీ ఛిన్నాభిన్నం చేస్తాయి
ప్రతిదాన్నీ అవి నిర్దాక్షిణ్యంగా ధ్వంసంచేస్తాయి
చివరికి
ఈ విధ్వంసకుడి భయంకరరూపం
పెరిగి పెరిగి ఆకాశాలు వింటుతుంది

ఈ అర్ధరాత్రి
ఎవరూచూడని సందుగొందుల బాటల్లో
మంత్రదీపం రుళిపిస్తూ అంతవేగంగా
పోయే అతనెవరు ?
అట్టడుగు లోతుల్నించి

అతివేగంగా జారిపోయే అతనెవరు ?
ఈ యువతుల పాటల్లో
అగ్ని ఎవరు ? తుఫానెవరు ?
బెంగాల్‌ను మూడడుగుల్లో దాటేసి
రాజు తలమీద పాదంమోపడానికి
త్వరపడుతున్న అతనెవరు ?
అన్నీ అనుమానాలూ, ఆందోళనలేకాని
నాకేమీ అర్థం కావటంలేదు
పత్రికలూ రేడియోలూ టెలివిజన్‌లూ
ఏవీ వాస్తవాలు ప్రకటించవు
అక్కడేమో జరుగుతోంది
రోజులేమో తెలియనివి
దేశపు నేలమాళిగల్లో
శక్తివంతురాలు మహాకాళి నివసిస్తుంది
అంతులేని కోపమూ
మంటల కరవాలాలూ
పంజాలూ కోరలూ
ఆ నల్లని మహాతల్లి ఆయుధాలు

బెంగాల్ నుంచి ఒక్కవార్త కూడా లేదు
తప్పకుండా అక్కడేదో జరుగుతోంది
కొందరు చంపుతున్నారు కొందరు చనిపోతున్నారు
బహుశా ఆకలి హత్యలు చేస్తుండొచ్చు
తలలు నరుకుతుండొచ్చు
వాటిని కోటగుమ్మాలకు వేలాడదీస్తుండొచ్చు
లేదా ముళ్ళచెట్లమీదికి విసిరేస్తుండొచ్చు
లేదా లాకప్పుల్లో హింసిస్తుండొచ్చు
లేదా యుద్ధం చెలరేగుతుండొచ్చు
లేదా బాంబులు పేలుతుండొచ్చు
హిస్సుమని ధ్వనిస్తుండొచ్చు

లేదా అది చెట్లనూ గోపురాలనూ
ఓడానికోటి తాకించి కూల్చేసే
భయంకర తుఫానుకావచ్చు

ఆ శిథిలాల్లో
అన్ని మట్టిదారులూ, సందులూ కనపడకుండపోవచ్చు
లేదా అది ఒక అంతిమవెల్లువకావచ్చు
గర్జించే అలల్లో అందరూ మునిగిపోయి
చివరికి పాలిపోయి, ఉబ్బిపోయి
పైకితేలే ఒక అంతిమ వెల్లువ కావచ్చు
వినిపించేవార్తలు దారుణంగా ఉన్నాయి
వినిపించనివార్తలు మరీ భయంకరంగా ఉన్నాయి

సంజయా
అక్కడ జరుగుతున్నదేమిటి ?
ఏమిటది ? ఓ ! ఏమిటది ?

(మలయాళీనుంచి ఇంగ్లీషు శంకర్ జీ - రచనాకాలం 1972)

1. విప్లవానికి ముందరిస్థితిని సూచించే భారతసంక్షోభం
2. టీ ఎస్ ఇలియట్, దివేస్ట్‌లాండ్; షేక్స్‌పియర్. మాక్‌బెత్
3. నోవా : పాశ్చాత్య పురాణాలలో ఒక ముఖ్యమయినపాత్ర. దేవుడు ప్రపంచాన్ని ప్రళయంలో (deluge) ముంచి ఒక్కనోవానుమాత్రం బ్రతికించి, ఒక్కొక్క జంతుజాతినుండి రెండురెండు జంతువులనుమాత్రం రక్షించి సృష్టిని సజీవంగాఫుంచే బాధ్యత నోవామీద పెట్టాడని పురాణం.
4. సిసీఫస్ : గ్రీకుపురాణాలలో ఒక 'శాపగ్రస్తుడు' ఒక బండరాతిని కొండ శిఖరం మీదికి తోసుకుపోవాలని అతనికిశాపం. శిఖరంపైకి చేరగానే ఆ రాయిజారి క్రిందికిపడుతుంది. దాన్ని అతను అట్లాగే మళ్ళీ మళ్ళీ పైకితోసుకుపోవాలి. మానవయత్నం అంతావ్యర్థం అనే నిరాశావాద సిద్ధాంతానికి సిసీఫస్ రాయి ఒక సంకేతం.

## ఇక్కడ

కార్మిక

ఫ్యాక్టరీ గేట్లముందూ
గనులముందు
పిచ్చెత్తినట్టు బూట్లచప్పుడు
వీధుల్లో డీసిల్ వ్యాన్ల మోత....
మార్కెట్లల్లో, సినిమా హాళ్ళముందూ,
దుకాన్లముందు....
రైల్వేస్టేషన్లల్లో, బస్టాండుల్లో,
ధనాధన్ బూట్లచప్పుడు...
మీరీ అక్షరాలు చూస్తుండగానే....
ముఖం పగిలిన యువకుడు
లాఠీ ముఖంమీద నెత్తురు ఉమిస్తాడు....
వాడు అరిచీ అరిచీ చెమటలుపట్టి
కూలబడిపోతాడు అధికారపుకుర్చీలో....
దాత్రికులా కొమ్మునాకే కుక్కవిశ్వాసం
ఎంతసేపు నైతికంగా నిలబెడుతుంది వాణ్ని ?
ఇదిగో ఇప్పుడు కూడా మీకు లాఠీదెబ్బలు
వినబడుతూనే ఉండిఉండాలి....
జనంతిరిగే ప్రతిచోట గద్దకళ్ళు...
ఇక్కడ భయంకరంగానే ఉన్నది....
ఐ వీరోచితంగా ఉన్నది....

లాంగ్‌మార్చ్ కథ

# "అతని అడుగు జాడల్లో"

వాంగ్ యువాన్ - చియెన్

Following his foot Prints కు యింగ్లీషు నుంచి స్వేచ్ఛానువాదం : 'నానీ'

మంచు పర్వతశిఖరం అంచుగుండా సాగిపోతూ, వాళ్ళు, తెల్లని కొండశిఖరాల్నీ, మంచుకొండల్నీ చూశారు ఎదురుగా.

భయంకరమైన చలిగాలి కారుమబ్బుల్ని పర్వతం వెనకనించి ముందుకు ఎగరగొడుతోంది. చలిగాలి వూడ్చిపారేస్తున్న మంచు, దగ్గరి కొండల్నీ దూరపు శిఖరాల్నీ కప్పుతోంది. మంచు తుఫాను మొదలైంది. ఆ తుఫానులో ముందుగా సాగిపోయిన దళాలు ఏర్పరచిన మార్గాన్ని గుర్తించటం అసాధ్యంగావుంది.

ఆందోళనగా రాజకీయ ఉపాధ్యాయుడు (Instructor) పెంగ్‌చావో - చియాంగ్ తలని విదిలించి, గుండెనిండా గాలిపీల్చుకొన్నాడు. తను నడిపిస్తున్న జబ్బుపడ్డ కామ్రేడ్‌ని మరింత బలంగా పట్టుకొన్నాడు సుళ్ళుతిరుగుతున్న మంచులో వాళ్ళు దారివెతుక్కుంటూ తీసుకెళ్తున్నారు. కనీసం వాళ్ళింకా పర్వతంమీది, గట్టిమంచునీ మెత్తటిమంచునీ వేరుచేసే రేఖవరకైనా చేరుకోలేదు. జబ్బుపడీ, గాయపడీ దళాలనించి వెనకబడిన కామ్రేడ్‌ల సహాయార్థం, పెంగ్ అక్కడ ఒక రెజిమెంట్ యూనిట్ స్థాపించాల్సివుంది. అతను అప్పటికే జబ్బుపడి దళాలనించి వెనకపడిన అనేకమంది కామ్రేడ్‌లకు సహాయపడి, తిరిగి వాళ్ళని వాళ్ళదళాలకి చేర్చాడు. ప్రస్తుతం ఈ జబ్బుపడ్డ కామ్రేడ్ మూలంగా అతనికి తనదళాన్ని అందుకోవటం అసాధ్యంగావుంది. ఒక్క అరగంట క్రితమే ఈ కామ్రేడ్ దారిపక్కన పడుండి కనిపించాడు. ఈ కామ్రేడ్‌కి సహాయం చేయాల్సిరావడంవల్ల అతని వేగంకూడా తగ్గుముఖం పట్టింది. పైగా శిఖరం పైకి చేరకముందే, ఈ మంచుతుఫానొకటి దాపురించింది.

మార్గం చాలా అపాయకరంగావుంది. పెంగ్‌కి తలంతా వాచినట్టూ, తల తిరుగుతోన్నట్టూ అనిపించింది. అతని కాళ్ళు దృఢంగా, బలంగావున్నాయి. వేస్తున్న ప్రతిఅడుగూ అతని అణువణువులోని శక్తినంతట్నీ లాగేస్తోంది. అతను ఊపిరి విడుస్తోంటే, అతని గుండెమీద మోయలేనంత బరువుందా అనిపిస్తోంది. అతని గుండె వేగంగా కొట్టుకుంటోంది. కూర్చోని, విశ్రాంతి తీసుకోవాలని అతని శరీరం తీవ్రంగా కోరుతోంది. కానీ అతని మనస్సు మాత్రం ముందుకు కదిలితీరాలని చెప్తోంది. ఈ స్థితిలో ఈ నీరసంలో, ఆయాసంలో ఆగితే మరణమే ఇక శరణ్యం. ఒక్కసారి కూర్చుంటే ఇకెప్పటికీ లేవలేనని అతనికి తెలుసు.

సెంగ్ మనస్సులోని ఆలోచనలు చదివాడా అన్నట్టుగా ఆ కామ్రేడ్ ఆగి, సెంగ్ భుజాలనానుకొని నిలబడి సెంగ్‌తో "ఇంక నాకేమీ ఓపికలేదు" అని మెల్లిగాఅన్నాడు. తర్వాత బతిమాలుతూ "నా మాటవిను కామ్రేడ్! నన్నొదిలి నువ్వన్నా వెళ్ళిపో నిన్ను వేడుకొంటున్నాను. నన్ను వంటరిగా వదిలిపెట్టెయ్యి...."

"ఈ పనికిమాలిన వాగుడుచాలు" సెంగ్ కోపంగా అడ్డుతగిలాడు. తన బలాన్నీ, నిశ్చయాన్నీ అతనికి చూపించడానికా అన్నట్టు దృఢమైన తన అడుగుల వేగం పెంచాడు.

కొంచెంపేసాగి ఆవ్యక్తి మళ్ళీ "బలం.... మనకికాస్త బలంవుంటే! ఎవరన్నా మనకికాస్త బలంయిస్తే!...." అని గొణిగాడు.

సెంగ్ పగిలిన పెదాలు నీరసపునవ్వుతో విచ్చుకొన్నాయి. ఆ మనిషి తన మనస్సులోవున్న విషయమే పైకిచెప్పాడు. అంత విశాలంగా విస్తరించివున్న మంచు ప్రాంతంలో ఎవరి మనస్సులోనైనా మెదిలే ఆలోచనలలాగే వుంటాయి. కానీ అది వుత్తి అసాధ్యమైన కోరిక. తమశక్తంతా ఉపయోగించి తమ లక్ష్యాన్ని చేరుకొనే మనుషుల విషయంలో అలాంటి మహత్యాలు ఎప్పుడూ జరగవు. అతను మృదువుగా "అలామాట్లాడి నీ ఊపిరి పోగొట్టుకోకు కామ్రేడ్! తరవాత్తరువాత కోసం నీశక్తిని కూడగట్టుకో. మనం పర్వతంపైకి ఎక్కితీరతాం" అన్నాడు.

వాళ్ళు అడుగుతరువాత అడుగువేస్తూ నెమ్మదిగా ఆ కఠినమార్గంగుండా ముందుకు సాగిపోతున్నారు. కాలంగడిచిపోయింది. చివరకు సుమారు గంట తర్వాత వాళ్ళు ఆ దరిద్రపు వరస దాటేశారు.

చిట్టచివరికి వాళ్ళు కొండకొనకి చేరుకొన్నారు. ఆ చివరిప్రయత్నం జబ్బుపడినవ్యక్తి శరీరంలో మిగిలివున్న శక్తినంతట్నీ హరించేసింది. అతనితల ముందుకు సెంగ్‌రొమ్ముమీదికి వాలిపోయింది. సెంగ్‌కికూడా తనశరీరంలోని శక్తంతా ఖర్చయిపోయిందనిపించింది.

ఆ సమయంలోనే అతను కింద కొద్దిదూరంలోవున్న దృశ్యం గమనించాడు.

కింద ఇక్కడా అక్కడా మంచులో కొంతమంది ఎర్రసైనికులు కూలబడివున్నారు. తుపానులో, శ్రమపడి సర్వశక్తులూ వినియోగించి ఆ పర్వత శిఖరం ఎక్కటంవల్ల అందరూ అలిసిపోయినట్టున్నారు. మరికొందరు అప్పుడే అక్కడికిచేరి తూలుతూ అటూఇటూ నడుస్తున్నారు. కానీ వాళ్ళుకూడా ఎక్కడోఅక్కడ కూర్చోవ

టానికి స్థలంకోసం వెతుక్కుంటున్నారు. జరగబోయే ఆపద అతని మెదడులో మెరిసింది. ఈ పరిస్థితుల్లో మంచులో కూర్చోవటం అంటే చేతులారా చావు కొనితెచ్చుకోవటమే!

పెంగ్ గుండె కొట్టుకోవడం మానేసింది. అతనికి తన కర్తవ్యం తట్టింది. వాళ్ళని కూర్చోనివ్వకుండా చెయ్యాలి. వెంటనే అతను తనమీద ఆనుకొనివున్న వ్యక్తిని తిన్నగా నిలబెట్టి వేలితో కిందికి చూపించి, తనకితనుగానే కిందికి దిగమని చెప్పాడు. తర్వాత వెంటనే మంచులో కూర్చొనివున్న ఒక ఎర్రసైనికుడివైపు దూసుకుపోయాడు. కానీ అప్పటికే ఆలస్యం అయిపోయింది. అతను చచ్చిపోయున్నాడు. అతని గ్రెనేడ్ల సంచితీసి తన భుజానికి తగిలించుకొన్నాడు పెంగ్. వెంటనే పక్కనున్న మరొక కామ్రేడ్ వైపు పరిగెత్తాడు. అతను బాకాలూదే కుర్రాడు. అతని చెయ్యందుకుని పైకి లేవదీశాడు. అంతలో అతనికి మరొకదృశ్యం కనబడింది. అంతవరకూ తను నడిపించుకవచ్చి, పైనవదిలిన కామ్రేడ్ మంచులో కూరుకుపోతున్నాడు.

'ఇప్పుడేంచెయ్యాలితను?' ఆందోళనగా అనుకొన్నాడు పెంగ్.

ఆసమయంలో మరోచెయ్యి బాకా కుర్రవాడి రెండోచెయ్యందుకుంది. పెంగ్‌కి తనహృదయంమీంచి పెద్దభారం తొలగించినట్లనిపించింది. కళ్ళనులుముకొని తన సహాయానికి వచ్చిన ఆవ్యక్తికేసి చూశాడు పెంగ్. ఆవ్యక్తి సాధారణపు రెడ్ఆర్మీ యూనిఫారంలోనేవున్నా, అతనిమొహంలో ఏదో కొట్టొచ్చినట్టు మెరిసిపోతోంది. దేవతాకథల్లో కనిపించే 'దయగలముదుసలి'లావున్నాడు ఆవ్యక్తి. అతనిగడ్డమూ, దట్టమైన కనుబొమ్మలూ మంచుతోకప్పివున్నాయి. అతనికళ్ళు దయగా, తెలివైన, తీక్షణమైన చూపుల్తో తెలిసినవాటిలాగానే, పరిచయమున్నట్టుగానే అనిపించాయి పెంగ్‌కి. కానీ వాటినెక్కడ చూశాడో ఎంతప్రయత్నించినా గుర్తురావటంలేదు.

భారంగా ఊపిరిపీలుస్తూ, ఆవ్యక్తి తనశక్తిని కూడదీసుకోవటానికి ప్రయత్నించాడు. పెంగ్ పరుగెత్తి, పైకెక్కి మంచులో కూరుకుపోతున్న కామ్రేడ్‌ని భుజంమీద వేసుకొని, కిందికిదిగి, ఆ వ్యక్తిపక్కకువచ్చి నిలబడ్డాడు. ఆ వ్యక్తి పెంగ్ వంకచూస్తూ, చిరునవ్వునవ్వి, తలూపుతూ "సరే, మనమింక బయలుదేరదాం" అన్నాడు. బాకా కుర్రాడినిలేపి, అతని కాళ్ళమీదనిలబెట్టాడు. ఆవ్యక్తి వెనకవచ్చిన అనేకమంది ఇతర కామ్రేడ్‌లని, పెంగ్ అప్పుడు గమనించాడు. అందరూ శక్తిలేక కూలబడిన కామ్రేడ్‌లకి సహాయంచేస్తూ తీరికలేకుండా వున్నారు.

ఆవ్యక్తి బాకాకుర్రాడి తలమీది మంచుదులిపేసి, వెనక్కితిరిగి గట్టిగా అందరినీ సంబోధించాడు. "కామ్రేడ్స్! మనం విప్లవంకోసం మరింత దృఢంగా ముందుకి సాగిపోవాలి". అతని కంఠస్వరం హీనంగావున్నప్పటికీ, అతని ఉత్తేజపూరితమైన, దృఢమైనపలుకులు అందరిదృష్టినీ ఆకర్షించాయి. వాళ్ళందరికళ్ళూ ఆనందంతోనూ,

ఉద్రేకంతోనూ నిండిపోయాయి. ఒకరిచెవుల్లో ఒకరు ఏదో గుసగుసలాడుకొన్నారు. వెంటనే కొందరు ఎవరిసహాయం లేకుండానే లేచినిలబడ్డారు. మరికొందరు ఇతరుల్ని సహాయంగాపట్టుకొని లేచినిలబడ్డారు. రైఫిళ్ళు భుజాలపైపెట్టుకొని, ఒకరిచేతులొకరు పట్టుకుని, గొలుసులాఏర్పడి నెమ్మదిగా, ఒకరివెనుక ఒకరుగా పర్వతం దిగనారంభించారు.

పెంగ్ తీసుకొస్తున్న జబ్బుపడిన సైనికుడు కూడా తన కాళ్ళమీదతను నిలబడి, ఎంతో ప్రయత్నంతో ఎవరి సహాయమూ లేకుండానే కుంటుతూ ముందుకి నడవ సాగాడు. పెంగ్ చేయందించబోగా అతను నవ్వుతూ "వద్దు కామ్రేడ్ ! నాఅంతటనేనే నడవగలను" అంటూ తిరస్కరించాడు.

'అతనికాశక్తి ఎలా వచ్చింది ? ఆ వ్యక్తి మాటలవల్లే వచ్చింది.' పెంగ్ తనలోతను అనుకొని ఆ వ్యక్తివంక గౌరవంగా చూశాడు.

అంగరక్షకుడిలా కనిపిస్తున్న యువకుడొకడు అవ్యక్తి దగ్గరికి వచ్చాడు. అతను వంటచేసే కామ్రేడ్‌ని నడిపిస్తున్నాడు. అతనువచ్చి నెమ్మదిగా చిన్నకంఠంతో "మనం ఇక బయల్దేరటం మంచిది. మీరు చాలా అలిసిపోయారు" అన్నాడు,

ఆవ్యక్తి అంగీకారంగా తలూపాడు. వెనక్కితిరిగి అంతవరకూ నడిచివచ్చిన దారివంక చూశాడు. తర్వాత పెంగ్ వంకతిరిగి, భుజంమీద చెయ్యేసి "నువ్వు పార్టీ సభ్యుడివా ?" అని అడిగాడు.

పెంగ్ అవునని జవాబిచ్చాడు.

"చాలా అలిసిపోయావుకదూ !"

ఆయన దయగల, శ్రద్ధగల కన్నుల్లోకిచూస్తూ పెంగ్ అవునని ఒప్పుకున్నాడు.

"అవును ! పరిస్థితులు చాలా కఠినంగావున్నాయి." అని దీర్ఘంగా నిట్టూర్చాడు. "కష్టాలేలేకపోతే నీకూ, నాకూ, మిగిలిన కమ్యూనిస్టులకీ ఇక్కడుండాల్సిన అవసరమే వుండేదికాదు" గట్టిగా ఊపిరిపీలుస్తూ అవ్యక్తి తన గుండెని చేత్తో గట్టిగారుద్దుకొన్నాడు. ఆయన పెంగ్‌కి దగ్గరగావచ్చి "ఎవరైనా ఒక మనిషికావాలి." అన్నాడు. అని చుట్టూ తిరిగి ఇతరులవైపు చూశాడు.

ఆయన ఉద్దేశ్యం పొరపాటుగా అర్థంచేసుకొని, అంగరక్షకుడు సంచితెరచి కాగితమూ, పెన్సిలూతీసి ఆయన కందించాడు, ఆయన తలవూపి వాటినందుకొన్నాడు చెయ్యి గట్టిగా రుద్దుకొని, వేడిచేసుకొని రాశాడు

పెంగ్‌కిప్పుడర్థమైంది ఆయన ఉద్దేశ్యం. ఈ ఉత్తర్వుని ఎక్కడికో తీసుకు వెళ్ళటంకోసం మనిషి కావాలన్నాడన్నమాట ! పెంగ్ నిటారుగా నిలబడి "ఈ ఆర్డర్ ఎవరి దగ్గర్నించి....?" అన్నాడు.

నవ్వి, ఆయన సంతకం చేశాడు.

"చౌఎన్-లై?" పెంగ్ అదురుపాటుతో తెలియకుండానే బిగ్గరగా కేకవేశాడు? పెంగ్ ముఖం ఉత్తేజంతో ఎర్రబడింది. ఆయన పేరుని ప్రతిఎర్రసైనికుడూ ప్రేమిస్తాడు, ఎంతగానో గౌరవిస్తాడు; ప్రాణాలకంటె అధికంగా నిజమేనా? పెంగ్‌కి ఇంకా నమ్మశక్యంగాలేదు. చైర్మన్ మావోకి కుడిభుజంలానిలిచి, లాంగ్‌మార్చ్‌కి నాయకత్వం వహిస్తున్న చౌఎన్‌లై యేనా? ఇంత అనారోగ్యస్థితిలోకూడా ఆయన తనలా-ఒక సామాన్య ఎర్రసైనికుడిలా- ఈ భయంకరమైన మంచుకొండల్లో ప్రయాణిస్తున్నాడా? పెంగ్ శరీరంలోని అణువు అణువూ నూతనోత్సాహంతో నిండిపోయింది.

"వైస్‌చైర్మన్ చౌ!"అని పెల్యూర్ చేశాడు పెంగ్. పెంగ్ శరీరం ఉద్రేకంతో పొంగులువారుతూండగా వణికేచేతుల్తో ఆ ఉత్తర్వు నందుకున్నాడు.

"కామ్రేడ్స్! ఆగవద్దు. ముందుకి సాగిపోండి" పెంగ్ మెల్లిగా చదువుకున్నాడు.

పార్టీ కేంద్రకమిటీ మిలిటరీ కమీషన్‌కి ఉపాధ్యక్షుడు, కామ్రేడ్ చౌఎన్‌లై తలవూపి గంభీరంగా "చేరాల్సినగమ్యం ఇంకా చాలా దూరంలోవుంది. ఇంకా ఎన్నో ప్రమాదాల్ని, కష్టాల్ని ఎదుర్కోవాల్సిరావొచ్చు. కష్టాలు తలెత్తినప్పుడే కమ్యూనిస్టులు అవసరమౌతారు". అని పెంగ్ చేయందుకొన్నాడు. "కామ్రేడ్! గాయపడిన సైనికులని నువ్వు నడిపించేటప్పుడు వాళకిది అందుంచు"

తర్వాత ఆయన తిరిగి బాకాకుర్రాడిని నడిపించుకుంటూ మార్చ్‌లో కలిసిపోయాడు. కొద్ది అడుగులువేసి మళ్ళీ పెంగ్ వైపుతిరిగి "గుర్తుంచుకో కామ్రేడ్, ఇంకా నిలబడకు" అన్నాడు.

తుఫానుగాలి భయంకరంగా వీస్తోంది.

పెంగ్ ఆ ఉత్తర్వుని గట్టిగా పట్టుకొని ముందుకిసాగిపోతున్న దళాన్ని చూస్తున్నాడు. అక్కడ, వైస్‌చైర్మన్ చౌఎన్‌లై బాకాకుర్రవాడిని నడిపించుకుంటూ, మంచు తుఫానులో ముందుకి సాగిపోతున్నాడు; వెనక మంచులో లోతైన అడుగుజాడలతో పొడవైన మార్గాన్ని వదిలి.

పెంగ్ కళ్ళనుండి కన్నీళ్ళు జారిపోతున్నాయి. అలిసిపోయిన సహచరులకి నూతనశక్తిని ఇవ్వగలిగినట్టి, తనకున్న సర్వస్వాన్నీ, తననీ స్వార్థరహితంగా అంకితమిచ్చి, ఇతరుల హృదయాల్ని కదిలించివేసే, ఉత్తేజపరిచే ఆ మహోన్నత వ్యక్తి కోసం కృతజ్ఞతతో ఈ కనీ...

పుస్తక పరిచయాలు :

## జ్యూలియస్ ఫ్యూజిక్

అదిమొదటి ప్రపంచ యుద్ధకాలం. "ఆరుకోట్లసైన్యం పదిహేనుకోట్ల డాలర్ల ఖర్చుతో జరిపినయుద్ధంఅది. కోటిన్నరమంది చనిపోయారు."

ఆ సమయంలో 'ప్రాగ్' నగరంలో ఓచోట కూలీలు గోడౌన్‌లోని రొట్టెలు లారీలో లోడ్‌చేస్తున్నారు. లారీచుట్టు ఆకలితో అలమటిస్తున్న పసిపాపలు చేరేరు.

"ఆకలేస్తుంది. చిన్న రొట్టెముక్క ఇవ్వరూ"అంటూ అడిగేరు. బదులుగా సైనికులు కాల్పులుజరిపేరు. ఆరుగురు పిల్లలు చనిపోయారు.

ఇలాంటి వాతావరణంలోఉండి పేదరికంలో బాధపడుతున్న ఫ్యూజిక్ మొదటి ప్రపంచ యుద్ధఫలితాలను తనహాస్య, వ్యంగ్య రచనలద్వారా తాను ప్రచురించే పత్రికల ద్వారా ప్రజల్లో ప్రచారంచేసారు. అంతేకాక అక్టోబర్ విప్లవోత్తేజంతో మేడే కార్యక్రమాల్లో పాల్గొని జైకల్లో వేకియాలోకూడ అనివార్యమైన పీడితప్రజల విప్లవ విజయానికి సంకేతంగా ప్రాగ్ నగరంలో జరిగిన పై సంఘటననుచూచి ఓ కవిత రాశాడు.

పీడకులు:- ........

లోకంలో ఆకలి రాజ్యమేలుతుంతా ?
ఫరవాలేదు అందుకు ఉందిలేమందు
జైళ్లూ, తుపాకులూ కాకుంటే ఉరితాళ్లూ

పీడితులు........

మీ నోటివాక్కు నిజంకావచ్చు
మేమూ నవ్వుతాము
ఉరితాళ్ళు మీమెడను పడే సుదినాన
.... .... .... .... ....

అని ఫ్యూజిక్ తన కవితలో పీడితప్రజల చైతన్యాన్ని స్పష్టంగా చిత్రించాడు.

ఈ కవిత రాసేనాటికి అతను కమ్యూనిస్టుకాడు. కాని కష్టజీవి. పేదరికంలోనే జీవితాన్ని చదవడం ప్రారంభించినవాడు. రెండేళ్ళ ప్రాయంనుండే నాటకరంగంలో అడుగుపెట్టి పదకొండేళ్ళ వయస్సువరకు, స్కూలుకు వెళ్ళలేకపోయినా ఆటపాటలతో పాటు పుస్తకాల అధ్యయనంలో చాలా శ్రద్ధచూపేవాడు. కాని క్రమంగా జీవితంలోని

సంఘర్షణను, సమాజంలోని వర్గపోరాటాన్ని, అందులో తప్పకుండ పీడితులకు లభించే విజయాన్ని అర్థంచేసుకొని కమ్యూనిస్టుపార్టీలో చేరి కలంతోపాటు కత్తి చేపట్టి పోరాటం చేసినవాడు. ఆనాటి కమ్యూనిస్టుపార్టీ రహస్యంగా పనిచేస్తున్నది. ఫ్యూచిక్ ఒకవైపు పార్టీకార్యకలాపాల్లో చురుకుగా పాల్గొంటూనే మరొకవైపు వివిధ దేశాల్లోని సాహిత్యం గురించి అధ్యయనంచేసి అందులోని అభ్యుదయాంశను తన దేశంలో పత్రికలద్వారా ప్రచారం చేసేవాడు. తాను చేస్తున్న ప్రభుత్వోద్యోగం పోయినా మోతకూలీగా పనిచేస్తూనే రచనా కార్యక్రమాన్ని కొనసాగించాడు. ముఖ్యంగా "అవంత్‌గార్డా (1925) పత్రికద్వారా విద్యార్థిరంగంలో విప్లవ భావాల ప్రచారంకోసం తీవ్రంగా కృషిచేశాడు. వ్యాపార పత్రికలకు తన సోషలిస్టు భావాలకు పొత్తుకుదరక పత్రికల్లో లభించిన అనేక ఉద్యోగాలకు అతడు రాజీనామా చేశాడు.

ఈ విధంగా ఫ్యూచిక్ పోరాటాలు ఉధృతమయ్యే కొద్దీ తన కాలాన్ని పూర్తిగా పార్టీపనికే వినియోగించేవాడు. బయటి ప్రపంచానికి మాత్రం ఒక రచయితగానో, సంపాదకుడుగానో, పాత్రికేయుడుగానో కనబడేవాడు. నిరంతరం ఏదో ఒక పత్రికను నడపడమో లేదా రచనలు సాగించడమో చేసేవాడు. ఈ విధంగా ఆనాటి రహస్య కమ్యూనిస్టుపార్టీకి Full time సభ్యులతోపాటు part time (పాక్షిక) సభ్యులుకూడా ఉండేవారు.

1928 లో జెకస్లోవేకియాలో ఎన్నికలు జరిగాయి. ఎన్నికలకంటే ముందే సోషలిస్టు భావాలుగల పత్రికలనన్నింటినీ ప్రభుత్వం నిషేధించింది. అప్పుడు ఫ్యూచిక్ ఉన్న యూనివర్‌సిటీ ప్రొఫెసర్ సాల్డా అనునతడు "త్వోర్బా" అనే పత్రికను ప్రారంభించడానికి సన్నాహాలు చేస్తుండగా ఫ్యూచిక్ పార్టీ ప్రచారానికి ఆ పత్రికను వాడుకోవాలనుకున్నాడు. ఆ ప్రొఫెసర్ తన పత్రికను ఫ్యూచిక్‌కు వదిలిపెట్టాడు. ఫ్యూచిక్ పార్టీ కార్యకర్తగా విప్లవ పోరాటంలోకి, దానికి సంబంధించిన సాంస్కృతిక రంగంలోకి మేధావి వర్గాన్ని ఎలా నైపుణ్యంతో కలుపుకొని వచ్చేవాడో తెలుసుకోవడానికి ఇదొక ఉదాహరణ మాత్రమే.

1929 లో బొహీమియా బొగ్గుగనుల్లో కార్మికులు సమ్మెచేస్తుంటే జెక్ దేశ ప్రజల తరుపున వారికి తన స్నేహహస్తాన్ని అందించాడు. కార్మికుల జీవితాలను, పోరాటాన్ని చిత్రిస్తూ రాసిన వ్యాసాలు ప్రచురణ కాకుండా ప్రభుత్వం చేస్తున్న నిర్బంధ నిషేధాలనడుమ "సాల్టకా" (సమ్మె) అనే రహస్య పత్రికను ప్రారంభించాడు. తనను అరెస్టు చేయాలని ప్రభుత్వం ప్రయత్నం చేస్తుండగా కొంతకాలం రహస్య జీవితాన్ని కొనసాగిస్తూనే కార్మిక సంఘాల్లో తన కార్యకలాపాలను కొనసాగించాడు.

ఒక కొత్తసమాజాన్ని రూపొందించుకున్న సోవియట్ యూనియన్‌ను ఒక్కసారైనా చూడాలని ఫ్యూజిక్ అనుకునేవాడు. అది 1930 లో నెరవేరింది. అతడు సోవియట్ యూనియన్‌కు పోతున్న సందర్భంలో లామాగని కార్మికులు అతనికొక ఉత్తరం రాశారు. అందులో "మీరు సోవియట్ యూనియన్‌కు వెళుతున్నట్లు తెలిసింది.... వాళ్ళ విజయాలనేకాకుండా వాళ్ళు కెదురవుతున్న సమస్యలనుకూడా పరిశీలించండి. అక్కడజరిగే ప్రతివిషయమూ మనకు కొత్తపాఠాలే...." అనివారు ఫ్యూజిక్‌ను కోరారు.

ఫ్యూజిక్ సోవియట్ యూనియన్‌ను ఎంతబాగా అధ్యయనంజేశాడో తన పర్యటన తర్వాత అతడురాసిన "రేపు నిన్నగా మారినదేశం" అనే పుస్తకంలో లామాగనికార్మికులకు పరోక్షంగా వాళ్ళడిగిన విషయాన్ని యిలా స్పష్టంచేయడంద్వారా తెలుస్తుంది.

"సోవియట్ యూనియన్‌లో వందలాదిమందిని పొట్టనపెట్టుకొంటున్న ఆకలిని చూసేరా ?"

"లేదు."

"అన్యాయాన్ని ఎదిరించినవారినీ, న్యాయం కావాలన్నవారినీ వాళ్ళ తల్లిదండ్రులముందే నడివీధుల్లో పిట్టల్లా కాల్చేస్తున్నారా?"

"లేదు."

"అక్కడి కార్మికులు మాసిపోయిన బట్టలతో వుంటున్నారా ?"

"వున్నారు"

"వారి అవసరాలు ఇంకా తీరలేదా ?"

"లేదు" సోవియట్ యూనియన్‌లో చాలా వస్తువుల కొరతవుంది. అయితే అది కృంగి కృశించిపోతున్న బిచ్చగాడి శరీరంపై గుడ్డపేలికల్లా మాత్రంలేదు. అనుక్షణం పెరుగుతున్న పిల్లవాడి ఒంటిమీద బట్టలావుంది అక్కడికొరత."

సాంస్కృతిక విప్లవ సైనికుడు సైనికుడుకాగలిగితే లాభం ఏవర్గానికో ఫ్యూజిక్ జీవితం స్పష్టంచేస్తుంది.

అది 1930. జెక్ రిపబ్లిక్‌ప్రభుత్వం యువకులందరినీ బలవంతంగా సైన్యంలోకి చేర్చుకున్నది. అందులో ఫ్యూజిక్‌కూడావున్నాడు. కమ్యూనిస్టు సైన్యంలోఉంటే ఎంతప్రమాదమో గ్రహించిన ప్రభుత్వం ఆ తర్వాత అతన్ని సైన్యంనుండి తప్పి

పంపివేసింది. అయినప్పటికినీ సైన్యంలోవున్న అనుభవంతో అప్పటికే ఫ్యూచిక్ ప్రభుత్వానికి వ్యతిరేకంగా యుద్ధప్రమాదంగురించి హెచ్చరిస్తూ వివరంగా పత్రికల్లో వ్యాసాలురాసాడు, యుద్ధ వ్యతిరేక ప్రచారం తీవ్రంగా చేశాడు.

1931లో ఒక ప్రతినిధివర్గాన్ని సోవియట్ యూనియన్ వెళ్ళడానికి జెక్ సరిహద్దులను రహస్యంగా దాటించి బెర్లిన్‌నుండి వస్తుండగా జెక్ పోలీసులు ఫ్యూచిక్‌ను అరెస్టుచేసి జైళ్ళోపెట్టారు, జైలునుండి విడుదలై వచ్చినతరువాత బొహీమియా గనికార్మికులు తిరిగి ప్రారంభించిన పెద్దసమ్మెలో పాల్గొన్నాడు. ఆ సమ్మెను బలపరచవలసిందిగా విజ్ఞప్తిచేస్తూ అనేక వ్యాసాలురాసి రచయితలందరికీ పిలుపునిచ్చాడు.

ఫ్యూచిక్‌ను ఎక్కడ వుండనిచ్చినా ప్రభుత్వానికి తలకొరివిగాఉంది. 1982లో అతన్ని తిరిగి సైన్యంలో చేర్చుకున్నది. కాని తోటి సైనికులతో మాట్లాడరాదనీ, సమావేశాలు జరపరాదనీ, గతంలో "రూద్‌ప్రావో" పత్రికకు సంపాదకుడన్నది బయటపెట్టరాదని అనేక ఆంక్షలుపెట్టికూడా ఫ్యూచిక్‌ను పట్టుమని పదిరోజులుకూడా స్థిరంగాఉంచకుండా ఒకచోటినుండి మరోచోటికి బదిలీచేసేవారు. ఇలాంటి నిర్బంధాల మధ్యకూడా జెకోస్లోవేకియా గ్రామాలలో సాగుతున్న దోపిడీ దౌర్జన్యాలగురించీ అక్కడి ప్రజల జీవితాన్నిగురించీ ప్రజలకు కళ్ళకుకట్టినట్లు చిత్రించిన ఫ్యూచిక్ కథ ఒకటి బయటఉన్న "త్వోరాబ" పత్రికలో ప్రచురింపబడేసరికి సైనికాధికారులకు ఆ కథ ఎలాబయటికివెళ్ళిందో అర్థంకాక మతిపోయింది. ఇది ఒక్కటేకాదు. బొహీమియా బొగ్గుగనికార్మికుల పోరాటాల ప్రేరణతో వారిజీవితాన్ని ప్రతిభావంతంగా చిత్రించిన మరోకథ "బావిలోనిమనిషి - భూమిమీద ప్రజలు" (Man in the pit, people on the earth) అచ్చుఅయి ప్రచారం కావడంతో సైనికాధికారులు ఫ్యూచిక్‌ను తీవ్రమైన శిక్షలకు గురిచేయడం మొదలుపెట్టారు. ఆ కథ ప్రచురింపబడిన తర్వాత సైన్యంలోనుండి ఫ్యూచిక్ ఎప్పుడువస్తాడా, ఎప్పుడు నిర్బంధంలోకి తీసుకుందామా? అని పోలీసులు ఎదురు చూడసాగారు. 1934లో అతడు సైన్యంనుండి రాగానే పోలీసులు అరెస్టుచేసి జైలులోపెట్టారు. అయినా శత్రువు న్యాయశాస్త్రంలోని మెలకువలను ఉపయోగించుకొని నిర్దోషిగా బయటపడుతాడు.

దోపిడీ న్యాయశాస్త్రాలను, న్యాయస్థానాలను కూడ విప్లవ పోరాటంలో మెలకువతో వుపయోగించుకునేనేర్పు ఆనాటి జెక్ విప్లవకారులకు ఉండేదని ఇటువంటి సంఘటనలు తెలుపుతాయి.

ఫ్యూజిక్ నిర్దోషిగా బయటకువచ్చినా "రూద్ ప్రావో" "రూద్ వెసర్నిక్" పత్రికలను ప్రభుత్వం నిషేధించినందువలన జెక్ కమ్యూనిస్టుపార్టీ కోసం "హాలో నోవినీ" పత్రికను తన సంపాదకత్వంలో ప్రారంభించాడు: అయితే అప్పటికే అతడు రహస్య జీవితాన్ని గడుపుతున్నందువల్ల అనేక మారుపేర్లతోనే వ్యాసాలూ కథలూ వ్రాసేవాడు. ఈ విధంగా ఫ్యూజిక్ పార్టీ లీగల్ పత్రికలను రహస్య కార్యకలాపాలతో అనుసంధానం చేశాడు.

నిర్బంధం, గాలింపు చర్యలూ తీవ్రమైనందువల్ల "కారెల్‌మాంజ్" అనే మారుపేరుతో అజ్ఞాతవాసంలో నే ఉంటూనే తప్పనిసరి పరిస్థితిలో 1934 లో ఫ్యూజిక్ సోవియట్ యూనియన్‌కు పోవలసివస్తుంది. ఈసారి అతడు "రూద్‌ప్రావో" విలేఖరిగా వెళతాడు. అక్కడతను వెళ్ళిన తరువాత "కమ్యూనిస్టులు అంతర్జాతీయ దృక్పథం కలవారు" అన్నదానికి నిదర్శనంగా "ఫ్రుంజ్‌నగర సోవియట్ సభ్యుడు" అయినాడు. కిర్గిసియన్ జాతీయ విభాగంలో కొంతకాలం గౌరవ సభ్యుడుగా ఉన్నాడు.

"ప్యారిస్ కమ్యూన్ ప్రజలు" అన్నకథలో అతడు వర్గపోరాటం ఎంత తీవ్రంగా ఉంటుందో ఇలావర్ణిస్తాడు.

"వర్గ శత్రువుమీద దయఏమిటి? ఈ ఫ్యాక్టరీలుమీవి. దాన్ని మీ యజమానులు ఆక్రమించుకున్నారు. వాటిని మీరు స్వాధీనం చేసుకున్నారు. మంచిపని చేశారు. కానీ నష్టపరిహారం ఇవ్వాలనుకోవడం ఏమిటీ?"

"వర్గశత్రువును ఓడించడమేకాదు. దాన్ని ఒకవర్గంగా పూర్తిగా నాశనం చేయాలి"

"మానవత్వంలేని వాళ్ళమీద దయఎక్కువై ఈ సూత్రాన్ని మీరు మరిచిపోయారు".

"నెగ్గటం ఒక్కటేచాలదు. దాన్ని నిలబెట్టాలి. చేతిలో తుపాకీని మరింత గట్టిగా పట్టుకోవాలి."

ఒకసారి రహస్యజీవితంలో ఉన్నప్పుడు లైబ్రరీలో పుస్తకాలు చదివివస్తుండగా ఫ్యూజిక్‌ను జెక్ పోలీసుఒకడు అరెస్టు చేశాడు. తనలాంటివాడిని నాజీలకోసం పట్టియివ్వడం ఎంత దేశద్రోహమో అతనికిచెప్పి ఫ్యూజిక్ బయటపడ్డాడు.

1939లో మిరెక్ అనే కమ్యూనిస్టుపార్టీ కేంద్రకమిటీ సభ్యుడుచేసిన ద్రోహం వల్ల పార్టీనాయకులు చాలమంది పట్టుపడ్డారు. 1942లో ఫ్యూజిక్ కూడ గెస్టపోలచేత అరెస్టు చేయబడతాడు.

పుస్తకాలు విపరీతంగాచదివే ప్రారంభదినాల్లోనే అబద్ధాల ప్రతిబింబాలైన పుస్తకాలను "తగులబెట్టండి" అని ఫ్యూజిక్‌కు అనిపించేది. 1943లో అతడు జైల్లో ఉన్నపుడు తన అనుభవాలనోట్సు రాసిపెట్టాడు. ఆవిధంగా రాసిన కాగితాలను కొలిన్‌స్కీ అనే గెస్టపోగార్డు తనప్రాణాలనైన ఇవ్వడానికి సిద్ధపడి బయటకు చేరవేసే వాడు. "దాస్యంతో ఖైదులో మగ్గేనాటికి స్వేచ్ఛా స్వాతంత్ర్యాలతో వెలిగే రేపటికీ మధ్య ఈ చీటీలతో వంతెన నిర్మించాలని దృఢవిశ్వాసంతో ఉన్నాడు". అని అతని గురించి ఫ్యూజిక్ అంటాడు. కమ్యూనిస్టులు వర్గరహిత సమసమాజంకోసం దీక్షబూని త్యాగాలకు (చావుకికూడ) సిద్ధపడుతున్నట్లే సజీవ సాహిత్యంకోసం స్పందించే ప్రజావాస్తవవిరుద్ధమైన. అబద్ధాలతోనిండిన సాహిత్యాన్ని చదివినపుడు "తగలబెడదాం" అని భావోద్రేకాన్ని పొందడం సహజమే కానీ అవేపుస్తకాలు జీవితవాస్తవాన్ని, శ్రమజీవి చెమటనూ ప్రతిబింబిస్తే ఫ్యూజిక్ అన్నట్లు ".... ఈచీటీలతో వంతెన నిర్మిస్తాం" అన్న గెస్టపోగార్డుల స్పందించే త్యాగాలకు సిద్ధపడేవారుకూడా వీరే.

తనతోపాటు మరోచోట నిర్బంధంలోఉన్న భార్య అగస్తానా గురించి జైల్లో నుండి ఫ్యూజిక్ ఇలా రాస్తాడు.

"మేమిద్దరం స్నేహితుల్లా మెలిగాము. నారచనలను మొదట ఆమే విమర్శించేది ఆమె చూపులు నామీద అలా ప్రసరించకపోతే నేను రాయగలిగే వాడినేకాదేమో. నిరంతర సంఘర్షణలతో మా జీవితంలో ఒకరికొకరం అండగా నిలబడ్డాము.... అనేక ఆనందాలను అనుభవించాము".

అలాగే తనను ఉరితీయడానికి ముందు పార్టీ నుండి ఉత్తరం వస్తుందని ఎదురు చూస్తుంటే జైలుమార్పుకి ఉత్తర్వులు వస్తాయి. ఆ తర్వాత పార్టీకి రాసిన ఒక ఉత్తరంలో అగస్తానా గురించి

"అగస్తానా ఎలాఉందో మీకేమైనా తెలిసిందా?.... ఆమెకు నా ప్రేమాభివందనాలు తెలియబరచండి. ఆమె అలానే అంతధైర్యంగానే, దృఢంగానే పార్టీపనిలో ఎల్లకాలం నిలబడి ఉంటుందని ఆశిస్తాను.... పెళ్ళి (ఫ్యూజిక్ ఉరి తరువాత సమీక్షకుడు) చేసుకోవడం అసంభవమని మొండికేయవచ్చు కానీ సంభవమే. హృదయగతమైన విషయాలలో కానివ్వండీ, ఒకపనిలో కానివ్వండీ ఒక మనిషియున్న స్థానాన్ని అతనుపోతే మరోమనిషి పూరిస్తూనే ఉంటారు.... ఇదంతా ఇప్పుడే ఆమెకురాయవద్దు, చెప్పవద్దు ఆమె తిరిగి వచ్చినపుడు.... ఒకవేళ తిరిగివస్తే" అని భార్య పునర్వివాహం గురించి విశాల భావాలతో భౌతిక అవసరాలను, వాస్తవాలను దృష్టిలో పెట్టుకొని

రాస్తాడు. సమాజంలో స్త్రీకూడా విప్లవ పోరాటాల్లో పాల్గొంటే ఆమెలో దాగిఉన్న శక్తి దీక్షాబద్ధంగా పనిచేస్తుందో అగస్తానా మాటలు, చేతలు స్పష్టంచేస్తాయి.

పార్టీలో పనిచేస్తూ నిర్బంధింపబడిన అగస్తానా ద్వారా భర్త ఫ్యూజిక్ వివరాలను సేకరించాలనుకుంటున్న జర్మన్ కమిస్సార్ "నీ భర్తను నచ్చజెప్పు... 'న్యాయంగా' తనకు తెలిసిందంతా చెప్పేయమను.... లేదంటే యిద్దరినీ కట్టకట్టి కాల్చిపడేస్తాను" అని అంటాడు. కాని అగస్తానా మాత్రం ఆ మాటలకు బెదరకుండా "మిస్టర్! ఇలానన్ను బెదరించడం నీ తరంకాదు" అని ధైర్యంగా జవాబిస్తుంది.

తనపై జరుగుతున్న విచారణ సమయంలో "....సాయుధ విప్లవానికి ప్రయత్నం చేయడం నేరం అంటాడేమిటి? అలా అయితే ఆయుధాలు పట్టుకోవడమే నేరమైతే మొట్టమొదటి ముద్దాయిలు ఈ పోలీసులే అవుతారు. ఈ సైనికులే అవుతారు. ఈ గార్డులే అవుతారు. వీళ్ళను అడ్డంపెట్టుకొని తమను కాపాడుకుంటున్న ఈ ప్రభుత్వాలే కుట్రదారులు అవుతారు. "వీళ్ళ చేతుల్లోనుండి తుపాకులు లాక్కుని, అసలు తుపాకీలేలేని సమాజాన్ని నిర్మించడం కుట్ర ఎలాఅవుతుంది? దాన్ని నిర్మించే వారిని అడ్డుకోవడమే కుట్ర. వాళ్ళను కాల్చిచంపడమే అసలు కుట్ర" అని ఆ విచారణ తతంగాన్ని చూచి ఫ్యూజిక్ అంటాడు.

సెప్టెంబర్ 8, 1943 న ఉరితీయబడిన ఫ్యూజిక్ ప్రతికదలిక కూడ ఒక పార్టీ క్రమశిక్షణకుకట్టుబడి ఉండేది. అతను జెక్ రిపబ్లిక్ సైనికుడు కాడు. బోల్షివిక్ పార్టీ సభ్యుడు.

"మేమంతా సోషలిస్టు విప్లవాలకోసం భూమిలో నాటబడిన విత్తనాల వంటి వారం. ఈరోజు కాకపోతే రేపైనా వసంతకాలం రాకమానదు. అన్నీకాకపోయినా మాలో కొన్నైనా మొలకెత్తక మానవు" అని 'పీటర్ ముందుతరాలవారు" అనే నవలలో ఫ్యూజిక్ రాసినట్లుగా జెకస్లోవేకియాలో వసంతకాలం రావాల్సిఉంది. సోవియట్ సోషల్ సామ్రాజ్యవాదుల కబంధహస్తాలనుండి జెక్ ప్రజలు విముక్తి చెందాల్సి ఉంది. దానికోసం ఫ్యూజిక్ నాటిన విత్తనాలు మొలకెత్తినా అవి ఇంకా వృక్షాలుగా పెరగాల్సిఉంది. దోపిడీలేని వర్గరహిత నూతన సమాజాన్ని, అంటే సోషలిస్టు సమాజాన్ని, నూతన మానవున్ని సృష్టించవలసిఉంది.

దీనికోసం భారతపీడిత ప్రజలు తమహస్తాల్ని అందించాలి. దానిలో భాగంగానే విరసం లాంటి సాంస్కృతికరంగ సంస్థల్లో పనిచేస్తున్న రచయితలు ఫ్యూజిక్‌ను

మరింతగా ప్రజల్లోకి అంటే విప్లవ వెలుగులోకి తేవాలి. అతని ఆశయం ఇంకా అసంపూర్తిగా మిగిలిపోయిందని హెచ్చరిస్తూ ఆయన రచనలను భారత ప్రజలకు అందించాలి.

X X X X

"రక్తాక్షరాలు" నవలలో తప్ప జూలియస్ ఫ్యూజిక్‌ని పెద్దగా చదివే అవకాశం లేని సమయంలో తెలుగు పాఠకులకు విరసం సభ్యుడు కా॥ డానీ యీ పుస్తకాన్ని అందించడం అభినందించాల్సిన విషయం.

రచయిత ఒక సామాజిక అవగాహన, ఒక కమిట్‌మెంట్ కలవాడు అనడం నిర్వివాదాంశం. కనుక సమాచార సేకరణలో ఎన్నిఇబ్బందులున్నా (వాటిని ముందు మాటలో వ్రాసారు) తనకు లభ్యమైన సమాచారాన్ని అక్కడక్కడైనా అస్పష్టంగా ఉటంకించకపోతే బాగుండేది.

"నాయకత్వం ఎవరిదైతేనేం? ఈ మనిషికి అసలు ప్రజలమీద నమ్మకం లేనట్లుంది" (పేజి 8 నుండి 10) అని కొత్తగాఏర్పడిన జెక్ రిపబ్లిక్ ప్రభుత్వం గురించి ప్రశ్నలవర్షం కురిపించిన సోషల్ డెమోక్రటిక్‌పార్టీ కార్యకర్త గురించి ఫ్యూజిక్ అనుకుంటాడు.

నిజానికి అప్పటికే రచయిత పేర్కొన్న ప్రకారం ఫ్యూజిక్ కార్మిక, విద్యార్థి సంఘాలను స్థాపించాడు అగస్టు 1918 నాటికే (పైది అక్టోబర్‌లోని సంఘటన) వర్గ దృక్పథంతో అతడు రచనలను చేశాడు. ముఖ్యంగా పైసంఘటన ముందురాత్రి "కమ్యూనిస్టు పత్రిక"పై జరిగిన చర్చలో పాల్గొన్నాడు,

అయిన ఈ విధమైన అనుమానం ఫ్యూజిక్‌కు ఎలావచ్చింది. యిలాంటి వైరుధ్యంఉన్న వాక్యాలతో పాఠకులను ఇబ్బందిపెట్టడం జరిగింది. రచయిత సరియైనది ఏదోనిర్ణయించి దాన్నే రాయవలసింది.

"రూడ్‌ప్రావో" నిషేధింపబడిందని మొదట్లోరాసి ఆ తరువాత ఫ్యూజిక్ రచనలు అదేపత్రికలో ప్రచురితమైనట్లు (పేజి 21, 24, 26లలో) రచయిత రాసారు, ఇది ఎలాసాధ్యం? మధ్యలో నిషేధం తొలగింపబడిందా?

ఫ్యూజిక్ సైన్యంలోకి తీసుకున్న ప్రభుత్వమే తిరిగి పంపించివేసినట్లు (పేజి 18 & 21లలో) రాసారు. కాని "ఇంతకుముందు ఫ్యూజిక్‌ను రెండుసార్లు సైన్యంలోకి తీసుకున్నా, పెట్టుబడుదార్లకు లాభంనుచేకూర్చే యుద్ధాలలో సైనికుడిగా పనిచేయడం

## జైత్రయాత్ర

జనరల్ చూ టే జీవితపథంగా ఉన్నా ఈ చరిత్ర ఒక వ్యక్తి చరిత్రనే కాకుండా ఒక జాతిచరిత్రను చిత్రించింది. చైనా విముక్తి కొరకు సాగిన సుదీర్ఘ విప్లవపోరాటంలో నాయకత్వం వహించినవారిలో చూ టే ఒకడుకావడం అందుకుకారణం. చైనీస్ జాతి తన మనుగడ కోసం తప్పని సరిగాచేయవలసివచ్చిన పోరాటంతో చూ టే జీవితాన్ని ముడిపెట్టాడు. అందువలన ఆ పోరాటంలోని ఎగుడుదిగుళ్ళు చూ టే జీవితంలో కూడ మనకు కనిపిస్తాయి. ఆ పోరాటం విశాల ప్రజానీకపు విముక్తి పోరాటం కావడంవల అది చూ టే జీవితాన్ని మలచి తన నాయకుడుగా నిలబెట్టు-కొన్నది. పోరాటంతోచేయి కలపకపోతే చూ టే పేద రైతుగానో, చైనా ప్రజా జీవితాన్ని పట్టిపల్లార్చిన యుద్ధప్రభువుల కిరాయిమూకకు సేనానిగానో బతుకు ముగించేవాడు. అతడు జన్మించిన రైతుజీవితం అనుభవిస్తున్న దుర్భర దారిద్ర్యం, అందుకు కారణమైన కామందుల దోపిడీ దౌర్జన్యాలు, రైతుల తిరుగుబాట్లు, పోటెత్తిన సముద్రంలా విజృంభించిన విముక్తి పోరాటం- ఇందులో ఒక్కొక్కటీ అతని జీవితానికి పదునుపెట్టి. అతనిలో పోరాటచేవను కలిగించి, నాయకత్వస్థాయికి ఎదిగేలా చేసాయి. పాలకవర్గ దృక్పథంతో రాసిన చరిత్రలోనో, పెట్టుబడిదారీ సామాజిక సిద్ధాంతాల్లోనో తప్ప ప్రజాజీవితంతో పాలుపంచుకోకుండా వ్యక్తులు నాయకత్వస్థాయికి ఎదగడమనేది ఉండదు. ప్రజాజీవితాన్ని నడిపించిన నాయకులైనట్లు కనిపించే వ్యక్తులు, తమ గొప్పతనం కోసం ప్రజలను వాడుకొని వదిలేసినవాళ్ళు, ఎంతో కొంత ఆధ్యాత్మిక

---

యిష్టంలేక బయటకు వచ్చేశాడు." అని (పేజీ 30లో) రాసారు. ఈ రెండింటిలో వాస్తవమైన దానినే రచయిత పేర్కొంటే బాగుండేది.

"మా లోకొన్నాయినా" అని (పేజీ 33లో) ఉన్నచోట "మాలో కొన్నయినా" అని ఉండాలి.

ఏదిఏమైనా ఫ్యూజిక్ జీవితం సాంస్కృతికరంగ సైనికులైన మన పాణిగ్రాహి చెరబండరాజులను అడుగడుగునా గుర్తుచేసే సారూప్యం కలిగిఉంది. కనుక ఆయన రచనలు, జీవితం, జెక్ విప్లవ పోరాటాన్ని లోతుగా అధ్యయనంచేయాల్సిన అవసరం ఉంది. దానికి డానీ పుస్తకం కదలికగా చెప్పాలి.

— ఉజ్వల

---

జూలియస్ ఫ్యూజిక్ - ఉషా. ఎస్. డానీ; ప్రచురణ : "సాహితి", విజయవాడ - 10; పేజీలు 106 వెల: రు. 4.00; ప్రతులకు: 1) మైత్రి బుక్ హౌస్, బుక్ సెల్లర్స్ అండ్ డిస్ట్రిబ్యూటర్సు, విజయవాడ - 10. 2) 'సృజన' హనుమకొండ, వరంగల్ - 506 001.

తత్వంతో కలుషితమైన సిద్ధాంతప్రవక్తలై స్వాతంత్ర్యప్రదాతలుగా కీర్తింపబడే నాయకులు మనకు చాలమంది ఉన్నారు. ప్రజలను వెన్నంటి ఉండే చూ తే వంటి నాయకులే తక్కువ. కాబట్టి వ్యక్తి జీవిత చరిత్రగా కనిపించే ఈ జాతిజీవనయాత్ర అరుదైనది, అనుభవపూర్ణమైనది, ఆదర్శప్రాయమైనది.

చూ తే ఒక పేదరైతుకుటుంబంలో జన్మించాడు. ఆ కాలంలో చైనా రైతు కుటుంబాలు కామందుల పీడనకు, దోపిడీదౌర్జన్యాలకుబలై దుర్భరదారిద్ర్యంలో పరమ నికృష్టమయిన బతుకును ఈడుస్తున్నాయి. చూ తే కుటుంబపు దారిద్ర్యాన్ని అర్థంచేసుకోవడానికి రెండుసంగతులు తెలుసుకుంటేచాలు. వాళ్ళు నివసించేది ఉప్పును ఉత్పత్తిచేసే సెచువాన్ రాష్ట్రమేఅయినా అక్కడ ఉప్పు చాలప్రియంగా ఉండేది. బీదప్రజానీకానికి అది అందుబాటులో ఉండేదికాదు. అందువలన చూ తే కుటుంబం లోనివారు కూరల్లో ఉప్పువేసుకుంటే ఎక్కువ ఖర్చవుతుందని ఉడకబెట్టిన కూరలను ఉప్పుకరిగించిన వేన్నీళ్ళలో అద్దుకునితినేవారు. నూనెఖర్చు భరించలేక రాత్రిసమ యంలో దీపాన్ని వెలిగించలేకపోయేవారు. వూళ్ళో కొద్దిగామెరుగైన చూ తేకుటుంబం పరిస్థితే ఇలాఉన్నప్పుడు ఇతర రైతుకుటుంబాల పరిస్థితి ఎలాఉంటుందో ఊహించు కోవచ్చు. ఇక శ్రమచేసి అనుభవించడానికి వీలైన సమిష్టిసంపద ఊళ్లో రైతుల అనుభవానికిరాదు. శ్రమ రైతులదైతే అనుభవం కామందులది. ఈ రైతులందరు తమకోసం కష్టాలకడగండ్లనుదాచుకుని కామందులకు సుఖాలపంటలను పండించి ఇవ్వాలి.

పురుషస్వామ్య వ్యవస్థలో, అందులోనూ చైనారైతులు అనుభవిస్తున్న కనా కష్టపు జీవితంలో స్త్రీ కష్టాలగురించి చెప్పనలవికాదు. చూ తే తనతల్లిని జ్ఞాపకం చేసు కున్నప్పుడు అతనిముఖంలో ఆర్ద్రత, బాధ గోచరించేవి. ఆమెకు "అతుకులువేసిన బట్టలు ఒంటిమీద జీరాడేవి. అవైనా ఎట్లాఉండేవి. మాగిపోయి నూలుకనపడు తుండేవి. చేతులమీద నరాలు ఉబ్బెత్తుగా కనబడేవి. చాకిరీ చేసిచేసి చేతులు మకిల పట్టి ఉండేవి.... ఎప్పుడూ వంటచేస్తూనో, బట్టలుతుకుతూనో, కుట్టుపనిచేస్తూనో, ఊడుస్తూ ఎత్తిపోస్తూనో, నీళ్ళుమోసుకొస్తూనో బండెడుచాకిరీలో మునిగిపోయివుండేది." చైనా స్త్రీలకష్టాలకు చూ తేతల్లి ఒకప్రతీక. ఆమె చూ తేను ప్రసవించినప్పుడుకూడ తాను చేస్తున్నపనిని మధ్యలోఆపి ప్రసవం జరిగినతరువాత ఆ పనిని పూర్తిచేసింది. నిజానికి చైనాసమాజంలో "చాకిరీచెయ్యటం వంశపారంపర్యాన్ని ఉద్ధరించే కొడు కుల్ని కనటం, కుటుంబానికి శ్రమశక్తిని సమకూర్చిపెట్టటం స్త్రీ బాధ్యత." అంతకు మించి ఆమెకు ఎటువంటి హక్కులు ఉండేవికావు. పైగా పురుషుని దౌర్జన్యానికి,

అణచివేతకు గురవుతుండేది. రైతుకుటుంబాల్లోని పురుషులకే అందుబాటులో లేని చదువు స్త్రీలకు అసలే ఉండేదికాదు. పైగా "ప్రక్కవాడిపొలానికి నీళ్ళుపెట్టడం ఎంత తెలివి తక్కువో ఆడపిల్లల్ని చదివించడంకూడ అంతే" అనే అభిప్రాయం ఆనాటి చైనా సమాజంలో ఉండేది.

ఇటువంటి కుటుంబంలో పుట్టిన చూ తే కు చదువుచెప్పించాలన్న ఆలోచన, అవసరం ఇంట్లోపెద్దలకు కలిగింది. కామందుల పీడనలో కటికదారిద్ర్యాన్ని అనుభవిస్తున్న రైతులకు పుండుమీద కారంవలె పన్నులవసూలుచేసే అధికారులు, ఇతర ప్రభుత్వోద్యోగులు తరచుగా వచ్చిపడుతుంటారు. వాళ్ళుచెప్పే లెక్కలు రైతులకు అర్థంకావుగాని వాళ్ళుమాత్రం రైతుల గోళ్లూడగొట్టి తమకు చేతనయినంత దోచుకొని పోయేవాళ్ళు. ఇంట్లో చదువువచ్చినవాళ్ళు ఉంటే లెక్కలు అడగవచ్చు. అందుకోసం చూ తే ను, అతని సోదరులను బడిలో వేస్తే చదువు అంటిందిమాత్రం చూ తే ఒక్కడికే. ఇది అతనికి ఒక కొత్తజీవితాన్ని, కర్తవ్యాన్ని ఇచ్చింది. అక్కడనుంచి చూ తే ఎదుగుదల ప్రారంభమయింది.

అయితే ఆ కాలంలో చైనాలో పేదకుటుంబాల నుండి వచ్చినవారు చదువుకోవడమంటే సామాన్యమయిన విషయం కాదు. ఇంటిల్లిపాదీ పొద్దస్తమానం రెక్కలు ముక్కలుచేసికొంటేనే తిండికి వెళ్ళని రైతుకుటుంబాలు చదువుఖర్చును ఎలాభరిస్తాయి? కామందుల దగ్గర బానిసస్థాయిలో బతుకులు వెళ్ళమారుస్తున్న పేదల పిల్లలు పెద్దవారి పిల్లలతో కలిసిచదివే అంతస్తు ఏది? చూ తే చదువుకుకూడ ఈ సమస్యలు వచ్చాయి. అతడు తన సోదరులిద్దరితోబాటు చేరిన బడిలో మరో 16 మంది పెద్దింటి విద్యార్థులుండేవారు. "రైతుకుటుంబంలోంచి వచ్చిన యీ ముగ్గుర్నీ చూడ్డంతోటే ఆ పదహారుగురికీ.. మూడు బర్రెలు పాఠశాలలో ప్రామాణగ్రంథాలు చదువుకుందుకు చొరబడ్డట్టుగా" అనిపించింది. అయినా అవమానాలను, కష్టాలను ఎదుర్కొంటూ చదువుకోవడానికి చూ తే ముందుకు వచ్చాడు. చూ తే చదువు అక్షరాభ్యాసంతోనో, గ్రంథపఠనంతోనో పరిమితమయినదికాదు. అతడు చదువుతున్నకాలంలో దేశంలో జరిగిన ఎన్నో సంఘటనలు అతనికి ఎంతగానో బోధించి, ప్రభావితం చేసాయి. రాచరికవ్యవస్థను సంస్కరించడానికి సమర్పించిన విజ్ఞాపనపత్రం నుండి బాక్సరు తిరుగుబాటుకుదాటి మంచూరియాను వశపరుచుకోవడానికి చైనాలో రష్యా జపాన్ దేశాలు చేసిన యుద్ధంవరకు జరిగిన సంఘటనలన్నీ చూ తే తన చుట్టూఉన్న పరిస్థితులను అర్థంచేసికోవడానికి పనికివచ్చాయి. దానితో అతనికి మిషనరీ స్కూళ్ళన్నా, విదేశీయులన్నా అసహ్యం కలిగింది.

అప్పుడు చైనాలో సాంప్రదాయికమైన విద్యను మాత్రమే బోధించేవారు. రాచరికవ్యవస్థకు ప్రతినిధిఅయిన కన్‌ఫ్యూషియస్ భావాలు పాఠ్యాంశంగా ఉండేవి. ఆధునికవిద్యను, శాస్త్రవిజ్ఞానాన్ని నేర్చుకోవడం కష్టసాధ్యమైన, ప్రమాదభరితమైన పని. చూ తే "గణితశాస్త్ర గ్రంథాన్ని రహస్యంగా అధ్యయనం చేయాల్సివచ్చింది." పట్టభద్రుడయిన తరువాత చూ తే ఆధునిక విద్యను బోధించడానికి కొంతమంది మిత్రులతో కలిసి ఇలుంగుషియన్‌లో పాఠశాలను స్థాపించినపుడు సనాతనులతో, భూస్వాములతో ఎంతగానో పోరాటం చేయవలసివచ్చింది. చివరకు దేశంలో విషమిస్తున్న పరిస్థితుల దృష్ట్యా విద్యాబోధన తన బతుకుబాటకాదని, సైనికశిక్షణపొంది సైన్యంలో చేరాలని ఇల్లువదిలి వెళ్ళిపోతాడు.

ఈ విధమైన చూ తే మన స్తత్వానికి చిన్నతనంలోనే బీజం పడింది. తమ పని పాటుఉ తప్ప బయటిప్రపంచం తెలియని రైతుకుటుంబాల్లోకి అప్పుడప్పుడు నగరాల నుండి వచ్చే వృత్తిపనివాళ్ళు బండెడువార్తల్ని మోసుకొచ్చేవారు. వాటిలో యుద్ధాలు, పన్నులు, విదేశీసందయాత్రికు మొదలైనవెన్నో ఉండేవి. ఇవన్నీ చూ తే శ్రద్ధగా వినేవాడు. వీటన్నింటిలోకి చూ తే మనస్సును ఆకర్షించి, అతనిమీద బలమైనముద్రను వేసిందితైపింగు విప్లవం. ప్రపంచమంతటా బలమైన ప్రజాఉద్యమాలు తలెత్తిన 19వ శతాబ్ది మధ్యలోనే తైపింగు విప్లవం చైనాను కుదిపివేసింది. భూస్వామ్య వ్యవస్థమీద బలమైన దెబ్బతీసిన "తైపింగులు భూమిని స్వాధీనంచేసుకుని రైతుకూలీలకు పంచిపెట్టారు, బానిసవిధానాన్ని రద్దుచేసారు, స్త్రీలకు విముక్తి ప్రసాదించారు." అయితే ఈ విప్లవం రైతాంగాన్ని పూర్తిగా సంఘటితపరచక పోవడం, వ్యవసాయ విప్లవాన్ని సరియైన గమ్యానికి తీసుకుపోకపోవడం, ఎత్తుగడల్లోని తప్పిదాలు. విప్లవాన్ని ముందుకు తీసుకుపోయే పార్టీని నిర్మించకపోవడంవల్ల విఫలమయింది. కాని "భవిష్యత్తులో జరుగనున్న చైనా రిపబ్లిక్ అవతరణలో తైపింగ్ విప్లవం తొలికేక" అని మార్క్స్ ప్రశంసించిన ఈ విప్లవాన్ని చూ తే, చైనాకమ్యూనిస్టులు, ఎర్ర సైన్యం, అధ్యయనంచేసి ఎన్నో గుణపాఠాలను నేర్చుకున్నారు.

మిలిటరీ ఎకాడమీలో చేరడానికి యూనాన్‌ఫూ నగరం చేరుకున్న చూ తే అక్కడ రిపబ్లికన్ రహస్య విప్లవసంస్థలో చేరడంతో అతనిజీవితంలో రెండవదశ ప్రారంభమయింది. రాచరిక వ్యవస్థకు, మంచూపాలనకు వ్యతిరేకంగా సాగుతున్న సాయుధ పోరాటంలో అతడు నిమగ్నమైపోయాడు. చివికి జీర్ణించిపోయిఉన్న రాచరికపాలనా యంత్రాంగం ఒక్కొక్క రాష్ట్రంలో క్రమంగాపతనమై రిపబ్లిక్ సైన్యం చేతుల్లోకి

అధికారం వచ్చింది. చివరకు దేశప్రయోజనాలను తాకట్టుపెట్టి విదేశాలనుండి తీసి కొంటున్న రైల్వేనిర్మాణ ఋణంమీద తలెత్తిన ఉద్యమం 1911 విప్లవంగా రూపం తీసికొన్నప్పటికి అది ఎంతోకాలం నిలువలేదు. రిపబ్లికన్లు అవలంభించిన రాజీధోరణుల వలన, విదేశీయుల వ్యతిరేక కార్యకలాపాలవలన 1911నాటి బూర్జువా ప్రజాస్వామిక విప్లవం ప్రజల్లో రేకెత్తించిన ఆశలను వమ్ముచేసింది. అయితే డా. సన్-యట్-సన్ నాయకత్వంలోని రిపబ్లికన్‌సైన్యం రాచరికానికి వ్యతిరేకంగా తీవ్రమైన పోరాటాన్ని కొనసాగించింది. ఇటువంటి పరిస్థితుల్లో 1912లో కొమింటాంగ్ పార్టీ ఏర్పడి, దేశంలో మొదటిసారిగా జరిగిన పార్లమెంటు ఎన్నికలలో గెలుపొందింది. అయితే వ్యవస్థ మౌలికంగా రాచరికనియంతృత్వాన్ని అమలుజరిపేది అయినప్పుడు పార్లమెంటు ఎలాపనిచేస్తుంది ? అది రద్దుచేయబడింది. అనేకయుద్ధాలు ఉద్యమాలు చైనాను కుదిపివేసాయి. అందులో 1919 మే 4 నాటి విద్యార్థిఉద్యమం ఒకటి. ఈ ఉద్యమంలో "అధ్యాపకులు, విద్యార్థులుకలిసి పెకింగ్ యుద్ధప్రభువు ద్రోహాన్ని నిరసిస్తూ గొప్పప్రదర్శనలు నడిపారు. పారిస్ శాంతిసమావేశంలో మిత్రరాజ్యాల కూటమి చైనాలో జర్మన్ ఆధీనప్రాంతాల్ని జపానుకు బదలాయించడంపట్ల విద్యార్థుల్లో మేధావుల్లో క్రోధావేశాలు పెల్లుబికాయి. సాంస్కృతిక పునరుజ్జీవనంలో ఒక భాగమైన యీ ఉద్యమం కార్చిచ్చులా దేశవ్యాప్తంగా పాకిపోయింది. జపాన్ బహిష్కరణోద్యమంలో దేశభక్తిగల ప్రతిచైనీయుడూ పాల్గొన్నాడు." ఈ సమయంలోనే జరిగిన ఒకయుద్ధంలో చూటేసైన్యం సర్వనాశనమై పోయింది. అతని ఇద్దరు తమ్ముళ్ళు యుద్ధరంగంలో చనిపోయారు. ఈ దుఃఖాన్ని తట్టుకోలేక తండ్రి చనిపోయాడు తనదేశాన్ని విముక్తిచేయడానికి సైనికజీవితాన్ని ఎంచుకున్న చూటే కలలు ముక్కలు ముక్కలైపోయాయి. ఈ దెబ్బలను తట్టుకోలేక అతడు నల్లమందుకు అలవాటుపడిపోయాడు. ఇక సైనికజీవితానికి స్వస్తిచెప్పి తనకై "ఒకకొత్త జీవనసరళి, చైనాకి ఒకకొత్తబాట కనుక్కోవటానికి విదేశాలు వెళ్ళిపో"వాలనే నిర్ణయానికి వస్తాడు అతని 'ఒకకాలు ఇంకా పాతవ్యవస్థలోఉంది; రెండోకాలు భవిష్యత్తులో ఒక ఊతంకోసం ప్రయాసపడుతోంది." అప్పటికి అతనికింకా మార్క్సిజం తెలియదు.

అందుకే అభివృద్ధి చెందిన యూరపుదేశాల మీద, అవి అనుసరిస్తున్న పెట్టుబడిదారీ విధానం మీదా అతనికి భ్రమలు ఏర్పడ్డాయి. తమను పీడిస్తున్న దేశాలు అవలంబిస్తున్న పెట్టుబడిదారీ విధానమే తమ దేశాన్ని విముక్తంచేసి, అభివృద్ధిపరుస్తుందని ఆశపడ్డాడు. అందువలన నిరంతరం ఏదోఒక యుద్ధప్రభువుతో పొత్తుపెట్టుకొని చేసే యుద్ధాలను వదిలిపెట్టి, యూరపువెళ్ళి పెట్టుబడిదారీ విద్యను, సంస్కృతిని,

విధానాన్ని అధ్యయనంచేసివచ్చి మాతృదేశ విమోచనోద్యమానికి పాటుపడాలని నిర్ణయించుకొన్నాడు. అప్పటికి పెట్టుబడిదారీ వ్యవస్థయొక్క స్వరూపాన్ని మాత్రమే చూచి, స్వభావాన్ని అర్థంచేసికోని చూటే శాస్త్రసాంకేతికరంగాల్లో ఆ వ్యవస్థసాధించిన అభివృద్ధికి భ్రమించి, ఆ అభివృద్ధికివున్న దుర్మార్గస్వభావాన్ని గుర్తించని చాలమంది అమాయకుల్లో ఒకడు మాత్రమే. మరొకవైపు అతనిలో విదేశసామ్రాజ్యవాదులపట్ల వ్యతిరేకత కూడా ఉన్నది. అందుకే 1921 లో చైనా కమ్యూనిస్టుపార్టీ ఏర్పడినప్పుడు చూటే తాను అందులో చేరాలని అనుకోవడానికి కారణం కమ్యూనిజం అంటే ఏమిటో తెలిసి, అది తనకు నచ్చడంకాదు. చైనా కమ్యూనిస్టుపార్టీని విదేశ సామ్రాజ్యవాదులు తమకు తెలిసిన అసభ్యపదజాలాన్నంతా ఉపయోగించి తిడుతున్నారు. కాబట్టి చూటే తనకు ఆ పార్టీ కావాలని అనుకున్నాడు. అయితే కమ్యూనిస్టుపార్టీలో చేరడం ఇతర పార్టీల్లో చేరడమంత సులువుకాదు, కమ్యూనిజం అంటే ఆకర్షణేతప్ప అవగాహనలేని చూటేకు అప్పుడు పార్టీ సభ్యత్వం దొరకలేదు. చూటే ఫ్రాన్సుకు పోయినతరువాత అక్కడ చైనా కమ్యూనిస్టుపార్టీ శాఖకు నాయకత్వం వహిస్తున్న చౌ-ఎన్-లైని కలిసి పార్టీలో చేరిపోతాడు. బెర్లిన్‌లో అతడు నగరమంతా తిరిగి తనకు కనిపించిన ప్రతి దాన్నీ శ్రద్ధగా పరిశీలించాడు. "నైపుణ్యం, క్రమశిక్షణ, విద్యాగంధం, సంఘటితశక్తి వున్న శ్రామికవర్గాన్ని కూడగట్టుకున్న జర్మనీ లాంటి మహత్తర పారిశ్రామిక దేశమే యుద్ధంలో ఓడిపోయిందంటే, చైనా అటువంటి దేశపు అడుగుజాడల్లో నడవడం అవివేకం అనుకున్నాడు చూటే".

మాతృదేశ విముక్తి కొరకు కిటుకు తెలుసుకొందామని విదేశాలకు పోయిన చూటేకు ఆ రహస్యం తెలిసింది గాని అది అతడు అనుకొన్నట్లుగా పెట్టుబడిదారీ వ్యవస్థలో కాకుండా కమ్యూనిజంలో ఉంది. జర్మనీలో అతడు గడిపిన నాలుగు సంవత్సరాల కాలంలో చైనాలో కూడ ఎన్నో మార్పులు వచ్చాయి. రాచరికవ్యవస్థకు వ్యతిరేకంగా నిరంతరం పోరాటం కొనసాగిస్తున్న డా. సన్-యట్-సన్ దక్షిణాచైనాలో తాను కోల్పోయిన విప్లవస్థావరాన్ని పునరాక్రమించుకొని ప్రభుత్వాన్ని స్థాపించాడు. కమ్యూనిస్టుపార్టీతో సహకారం, కార్మికకర్షక ప్రయోజనాలకోసం కృషి, సోవియట్ యూనియన్‌తో మైత్రి అనే మూడు సూత్రాల ప్రాతిపదికమీద కార్మిక రైతాంగ ఉద్యమాలను బలపరచడంతో పెట్టుబడిదారుల, భూస్వాముల గుండెల్లో రైళ్లు పరుగెత్తాయి, భూస్వాములు గూండాలతో, కిరాయిమూకల్తో రైతాంగ ఉద్యమం మీద దాడులు చేసారు. చైనాలో రైతాంగ విప్లవం మొదలయింది.

కాని 1925 లో డా. సన్-యట్-సన్ మరణంతో కొమింటాంగు పార్టీలో చీలికలువచ్చాయి. చాంగ్-కై-షేక్ తిరుగుబాటుచేసి మూడుసూత్రాల విధానాన్ని బుట్ట దాఖలుచేసి కమ్యూనిస్టులను అణచివేయడానికి పూనుకొన్నాడు. డా. సన్-యట్-సన్ నిర్మించిన జాతీయ ఐక్యసంఘటన విచ్ఛిన్నం కాకూడదని కమ్యూనిస్టులు కొమింటాంగు పార్టీతో చేసికొన్న ఒప్పందం ఆచరణలో విఫలమయింది. నానాటికి చాంగ్-కై-షేక్ దాడులు అధికమవుతున్నాయి. విదేశ సామ్రాజ్యవాదుల మద్దతుతో కమ్యూనిస్టులను ఊచకోతకోసే కార్యక్రమాన్ని చేపట్టాడు తానేఅధ్యక్షుడుగా స్వంత కొమింటాంగు పార్టీని స్థాపించుకొన్నాడు.

ఈ పరిణామాల తరువాత 1927లో జరిగిన ఒక సమావేశంలో కమ్యూనిస్టు పార్టీ తనకార్యక్రమంలో మార్పును ఆమోదించింది. చాంగ్-కై-షేక్‌కు ప్రతిఘటన, రైతాంగవిప్లవాన్ని ప్రారంభించడం, ప్రజలను సాయుధంచేయడం అనే మూడుచర్యలను తన తక్షణకార్యక్రమంగా నిర్ణయించుకొన్నది.

అప్పటినుండి కమ్యూనిస్టు విప్లవదళాలు ఒకప్రాంతం తరువాత మరొక ప్రాంతాన్ని ఆక్రమించుకోవడం ప్రారంభించాయి. విజయాలు, అపజయాలుకలసిన ఒడిదుడుకులమార్గంలో రైతాంగవిప్లవం ముసుముందుకే పోయింది. కార్మిక రైతాంగ విప్లవ సైన్యాధిపతిగా చూ-టే ఈ అనుభవాలన్నింటినీ క్రోడచేసుకున్నాడు. ఆ అనుభవాలతో 1927లో అతడు రూపొందించిన రైతాంగ విప్లవనమూనా చైనా విముక్తి జరిగేంతవరకు పోరాటస్వరూప స్వభావాలను నిర్ణయించింది. బ్రహ్మాండమైన ఈ రైతాంగ విప్లవపోరాటంలో స్త్రీలు, పిల్లలు మొదలుగా చైనా పేదరైతాంగం చేసిన త్యాగాలు, కనబరిచిన పోరాటశీలం అపూర్వమైనవి. చూ-టే ఆధీనంలోఉన్న కమ్యూనిస్టు ఉక్కుపిండాలు కాంటన్‌కు వెళ్ళేదారిలో తూర్పునదీప్రాంతంలో చూచిన రైతులు, స్త్రీలు అందుకు ఒక ఉదాహరణమాత్రమే అక్కడి "రైతులు పెద్దపెద్ద బార్లతిరి బియ్యం, కూరగాయల కావిళ్ళతో చూ-టే సైన్యశిబిరాలవేపు కదలివచ్చారు ... రైతాంగంలో మూడింట రెండువంతులు స్త్రీలు, బాలికలు, మగవాళ్ళమాదిరి వాళ్ళూ బియ్యం కావిళ్ళు మోసుకొచ్చారు." "గన్నుఎత్తుకోనువ్వు, కత్తిపడతానేను"అని "రైతాంగ ఆత్మరక్షణ దళాల్లో పురుషులతోపాటు భుజం భుజంకలిపి పోరాడిందీ వాళ్ళే". ఉక్కుపిండాలకి కళ్లూ, చెవులూ యీ స్త్రీలే. శత్రుసమాచారం అందించే వార్తాహరులుగా, తిండీతిప్పలు చూసిపెట్టే అన్నదాతలుగా, పడవలమీద నదిదాటించే పల్లెకార్లుగా యీ స్త్రీలే విప్లవసేనకి సేవలుచేశారు."

"కూడు, గూడులేక, గాయపడ్డవాళ్ళని భుజాలమీద వేసుకుని మోస్తూ రైతు తిరుగుబాటుదార్లు అర్ధరాత్రివేళ నిద్రావస్థలో ఉన్న గ్రామంలో ప్రవేశించి మూసిన తలుపులమీద వేళ్ళతో తట్టి అతిమెల్లగా, 'అన్నా, తలుపుతియ్యి, మేం రైతాంగ ఆత్మరక్షణ దళం వాళ్ళం, ఈ ఒక్కరాత్రికి నీడివ్వు' అనే వాళ్ళు.

"ఊరంతా నిశ్శబ్దం. ప్రతి గుడిసెలో వాళ్ళ మాటలు వినబడ్డాయ్. కాని, యే గుడిసెలోంచీ అలికిడిరాదు. యే తలుపుసందునుంచీ వెలుగు బైటికి తొంగి చూడదు.... గృహిణి మొగుని చెవిలో గుసగుస లాడుతుంది.

'తెరపమాక. కామందు మూకని వెంటేసుకుని వచ్చుండొచ్చు'.

'మళ్ళీ తలుపుమీద రైతుగెరిల్లాల చేతివేళ్ళ టకటక'....

'అనంత నిశ్శబ్దం. ఎవరిదో ఒక తలుపు తెరుచుకుంటుంది. ఓ ముసలయ్య కళ్ళు చికిలించి బైటికి చూస్తాడు.... రైతుగెరిల్లాలు కంటపడగానే ఆ ముసలయ్య తలుపులు బార్లాతెరుస్తాడు. ఆ చీకట్లో యింటింటికీపోయి తలుపుదగ్గర నిలబడి 'వాళ్ళు చెప్పేది నిజమే' అంటాడు.

'కలలో మాదిరిగా, పల్లెలో ప్రతిగుడిసె తలుపూ తెరుచుకుంటుంది. మగవాళ్ళు బిలబిలలాడుతూ వీధిలోకొస్తారు. వాముల్లోంచి గడ్డితెచ్చి గుడిసెలో పక్కపరుస్తారు. గాయపడ్డవాళ్ళను లోనికి మోసుకెళ్తారు. వెంటనే తలుపులు మూసుకుంటాయ్. బైటికి యే అలికిడీరాదు. లోనరైతుగెరిల్లాల్తో కూర్చుని గుసగుసలాడ్తారు. ఆడవాళ్ళు చకచకాపొయ్యి వెలిగించి బువ్వవొండుతారు.

"దక్షిణచైనాలో వందలాది పల్లెల్లో యిటువంటి దృశ్యాలు ఎన్నో!"

చింగ్‌కన్‌షాన్ పర్వతప్రాంతాన్ని ఎర్రసేనకు వ్యూహాత్మక కార్యస్థానంగా నిర్మించడానికి పూర్వం అది ఇద్దరు బందిపోటు నాయకుల అధీనంలో ఉండేది. ఆ ప్రాంతంలో రైతాంగ విప్లవబీజాలుచల్లి, అక్కడి గ్రామాల్లోని రైతులను సమీకరించి, మావో వారికి శిక్షణాకార్యక్రమం ప్రారంభించాడు. ఇదంతా ఆ బందిపోటునాయకుల సమ్మతితోనే జరిగింది. ఈ ప్రాంతాన్ని తమకు అనుకూలంగా తయారుచేసినప్పటి నుండి మావో, చూటేలు కలిసి చైనారైతాంగ విప్లవాన్ని నడిపించారు. వారిద్దరి ఆధిపత్యంలో విడివిడిగాఉన్న సైన్యాన్ని ఏకంచేసి నాలుగవ ఎర్రసైన్యాన్ని నిర్మించారు. దానికి చూటే సర్వసేనాని, మావో పొలిటికల్ కొమిస్సారు. అయితే త్వరలోనే

చింగ్‌కన్‌షాన్ ప్రాంతాన్ని శత్రువు దిగ్బంధం చేయడంవల్ల నాలుగవ ఎర్రసైన్యం అక్కడ నుండి నిష్క్రమించవలసివస్తుంది. ఆ క్రమంలో అడుగడుగునా చాంగ్-కై-షేక్ దళాలతో ఎర్రసైన్యం పోరాడవలసివస్తుంది. ఈ పోరాటాలలో ఎర్రసైన్యాన్ని విజయపరంపర వరిస్తుంది. చివరకు 1930 లో ఒకసారి, 1931లో మరొకసారి ఎర్రసేనను తుడిచిపెట్టడానికి చాంగ్-కై-షేక్ అత్యధికసంఖ్యలో సైన్యాన్ని పంపినప్పుడు కూడ ఎర్రసేనకే విజయాలు లభించడానికి కారణం మావో, చూటేలు నిర్మించిన గెరిల్లాయుద్ధపద్ధతి, ఎర్రసైన్యాన్ని ప్రజలు కనురెప్పవలె కాపాడుకోవడం.

ఒకవైపు ఈ రైతాంగ విప్లవానికి, ఎర్రసేన విజయాలకు సారథ్యాన్ని వహిస్తూనే మావో, చూటేలు మరొకవైపు పార్టీలో పెటీబూర్జువా మనస్తత్వం కలవారితో సైద్ధాంతిక పోరాటం చేయవలసివస్తుంది. మావో, చూటేలు నిర్వహిస్తున్న రైతాంగ విప్లవం మీద వాళ్ళకు విశ్వాసం లేదు. కార్మికపోరాటాలను బలపరిచి, నగరాలను స్వాధీనం చేసికోవడం వరకే వాళ్ళ కార్యక్రమం. ఈ కార్యక్రమాన్ని ధిక్కరించినందుకు మావో, చూటేలను పార్టీసభ్యులు దుయ్యపట్టారు. అయినా వాళ్ళు తాము ఎంచుకొన్న మార్గంలో పయనించి చైనా విముక్తిని త్వరితం చేసారు. ఎర్రసైన్యానికీ ప్రజలకూ ఉన్న అవినాభావ సంబంధాన్ని ఒక కొమింటాంగు అధికారి తన మాటలో ఇలా వ్యక్తీకరిస్తాడు. "ఎర్రబందిపోట్ల అణచివేతకి సంబంధించి ప్రభుత్వం యీనాడనుసరిస్తున్న పద్ధతికంటే మేలైనపద్ధతి కనిపెట్టలేకపోతే, యావత్ ఎర్రప్రాంతాన్ని వేరుచేసి మనిషి మిగలకుండా విషవాయువుతో చంపిపారెయ్యవలసి వస్తుంది. పది-అరవై సంవత్సరాల మధ్య ప్రతి పురుషుడు, స్త్రీ, బాలుడు, బాలిక ఎర్రబందిపోట్లకి గూఢచారి లేదా ఎర్రదండులో సభ్యులు."

మావో, చూటేలు ఎర్రసైన్యానికి రాజకీయ చైతన్యం కలిగించడం ఒక కార్యక్రమంగా పెట్టుకొన్నారు. సమష్టిలక్షణం ఎర్రసైన్యానికి అలవడింది. అందరూ కలిసి పాటపాడడం వాళ్ళకు గొప్పఉత్సాహాన్ని కలిగించేది. అంతకుముందు చైనాలో ప్రజలు పాటను అరుదుగానే పాడేవారు. కాని పోరాటం ప్రారంభమయిన తరువాత పాట పోరాటంలో భాగంగా రూపొందింది

చైనావిప్లవం విప్లవపదజాలానికి 'లాంగ్‌మార్చ్'ను చేర్చింది. చైనా విప్లవమంతటిలోనూ లాంగ్‌మార్చ్‌ఘట్టం అత్యద్భుతమైనది. చైనా రైతాంగానికున్న పోరాటశీలాన్ని పరీక్షించి, పదునుపెట్టిందిఇది. 1934 నుండి 1936 వరకు రెండు

సంవత్సరాలపాటు నదులు, పర్వతాలు, అరణ్యాలగుండా 8000 మైళ్ళ పర్యంతం సాగిన సుదీర్ఘ యాత్రఇది. కాకలుతీరిన యోధులవంటి ఒకలక్షమంది రైతాంగవీరులు ఈసుదీర్ఘ యాత్రను చేసారు. మావో, చూతేల నాయకత్వంలోసాగిన ఈ యాత్రలో వాళ్ళు అనుభవించిన అంతులేనికష్టాలు పొందిన ప్రాణనష్టం, చూపిన ధైర్యసాహసాలు చూతే కళ్ళకుకట్టినట్లు చెప్పాడు. "క్వొంగ్మీ యుద్ధప్రభువులయితే మేం మార్చ్‌చేసే మార్గంనుంచి రైతుల్ని తరిమిపారేశారు. పల్లెల్ని తగలబెట్టారు. ఆ దుర్మార్గం మేం చేస్తున్నట్లు జనానికి కల్లబొల్లికబుర్లు చెప్పారు. గ్రామాలకు నిప్పుపెట్టే క్వొంగ్మీ ఏజెంట్లని కొన్నితూర్లు మేం పట్టుకుని కాల్చిపారేశాం." ఇటువంటి సంఘటనలు ఎన్నెన్నో! శత్రువు తమను తుడిచిపెట్టడానికి ప్రయత్నించినప్పుడల్లా యుద్ధంచేస్తూ ఎర్రసైన్యం లోలో సీమలోకి ప్రవేశించేసరికి 60,70 వేలకు తగ్గిపోయింది. ఇప్పుడు ప్రయాణించవలసిన ఈ లోలో సీమప్రాంతం గడ్డిపోచమొలవని, నీటిచుక్క దొరకని నిరామయ పర్వతసీమ. "అర్థ బర్బరులైన లోలో తెగవాళ్ళ స్నేహసహకారాలు లేకుండా ఆ సీమలో అడుగు ముందుకువెయ్యడం అసాధ్యం. ఎర్రసైన్యం కంటబడ్డం తోటే ఎక్కణ్ణుంచో 'వూయూ!.. వూయూ!..'అని పెనుకేక వినిపించేది. అది లోలో తెగ రణన్నినాదం. కొండయీనినట్లు లోలో తెగవాళ్ళు యీటెలుచేతబట్టి కందిరీగల గుంపులా ఎర్రసేనపైకి తెగబడేవాళ్ళు. ఈ లోలోతెగ పూర్వీకులే ఒకనాడు తైపింగు సైన్యంతో ఘోరయుద్ధం చేశారు. నలభై వేల తైపింగుసైన్యాన్ని నష్టపెట్టించారు." అటువంటి లోలోతెగ నాయకునితో ఎర్రసైన్యం కమాండర్ లియూపో-చెంగ్ కలిసి రక్తప్రమాణంచేసి స్నేహాన్ని సాధిస్తాడు. అప్పుడు "నల్లలోలో నాయకుడు అనేక మంది యోధుల్తో కలిసి ఎర్రసేనకి దారిచూపిస్తూ ముందునడిచాడు."

టాటూనది వచ్చింది. "తైపింగుసైన్యం సర్వనాశనమైన తావుయిదే.... షెచు వాన్ సైనికదళాలు రక్షణకట్టడాలు నిర్మించుకుని తైపింగుసైన్యాన్ని నాశనం చేసినట్లు ఎర్రసైన్యాన్ని నాశనంచెయ్యటానికి ఎదురుచూస్తూ కూర్చున్నాయ్." అయితే ఎర్ర సైనికులు నదిదాటటానికి నిర్ణయం తీసుకున్నారు.... గొలుసుల మీదపరచిన కొయ్య పలకలు వూడబెరికి శత్రువులు ఎర్రసైన్యానికి స్వాగతసన్నాహాలు పూర్తిచేశారు. వంతెనమీద రెండువందల గజాలపొడవునా అటూఇటూ ఊగులాడే ఇనుపగొలుసులు తప్ప మరేమీలేదు. కిందికిచూస్తే అయిదువందల అడుగులలోతున పెళపెళార్భటుల్తో ప్రవహించేనది.

"రెండు ప్లాటూన్లూ గొలుసులుపట్టుకుని ఊగులాడుతూ కత్తిమీదసాముగా నెమ్మదిగా కదిలిపోతోంటే.... అవతలి ఒడ్డుమీంచి తుపాకులుగర్జించాయి. మా తా-చియా నదిలో కలిసిపోయాడు. ఆయన తరువాత మరొకరు.... అయినా పట్టువిడవకుండా మిగిలినవాళ్ళు ముందుకు తోసుకుపోతున్నారు.... శత్రుసైనికులు చెక్కలమీద కిరోసిన్ డబ్బాలు గుమ్మరించి అగ్గిపుల్ల ముట్టించారు. దుప్పటిపరిచినట్లు మంటలు.... అనేకమంది తెగించి ముందుకిదూకారు. బట్టలకి మంటలంటుకున్నాయి.... వంతెన మొత్తం మంటలార్పుతూ రైఫిళ్ళు చేతబట్టుకుని పరుగులెత్తే మనుషులముద్దలా తయారైంది. శత్రుమూక వంతెనకిదూరంగా రెండవ రక్షణరేఖ వెనక్కి తిరోగమించింది. గతంలో చైనా వీరయోధులు విఫలమైపోయినతావున యిరవయ్యో శతాబ్ది చైనా కార్మిక రైతాంగం విజయం చూరగొన్నది. ఎర్రసైన్యం "మెట్టలేని పర్వతం, దాటలేనిది, జయించలేని దుర్గంలేవు."

ఇలాంటి పరీక్షల నెన్నింటినో తట్టుకుని ముందుకు సాగిపోయిన ఎర్రసైన్యం ఈశాన్య షెన్సీ రాష్ట్రాన్ని చేరుకొన్నది. అక్కడ చాంగ్-కై-షేక్ దాడుల్ని తిప్పికొడుతూ, జపాన్ వ్యతిరేక యుద్ధం చేయడానికి యేనాన్ ప్రధాన కార్యస్థానంగా రూపొందింది.

1936 లో సియాన్‌లో జరిగిన ఒక సంఘటనవలన చాంగ్-కై-షేక్ ఆధిపత్యంలోని కొమింటాంగు పార్టీకి, కమ్యూనిస్టులకు తాత్కాలికంగా పొత్తుకుదిరింది. జపాన్ సామ్రాజ్యవాదులను తమదేశంనుండి పారద్రోలడానికి ఎర్రసేనతో జాతీయ సమైక్య సంఘటన నిర్మించాలని చాంగ్-కై-షేక్ క్రిందిఅధికారి ఒకరు సూచించగా అతన్ని తొలగించడానికి చాంగ్-కై-షేక్ ప్రయత్నించాడు. కాని ఆ అధికారిచేత అతడే బంధింపబడతాడు. ఎర్రసేన నిర్మూలనోద్యమాన్ని కట్టిపెట్టడంద్వారా అంతర్యుద్ధాన్ని ఆపి, జపాన్ వ్యతిరేకపోరాటంలో పాల్గొనడానికి అంగీకరించిన తరువాత చాంగ్-కై-షేక్ విడుదల చేయబడతాడు. కాని కొద్దికాలానికే చాంగ్-కై-షేక్ ఎర్రసేన వ్యతిరేక కార్యకలాపాలను మళ్ళీ ప్రారంభించాడు. విముక్తిప్రాంతాలను కాపాడుకోవడానికి ఏనాన్‌లో కమ్యూనిస్టు ప్రభుత్వం ఏర్పడింది.

కొమింటాంగు దళాలు అమలుచేస్తున్న దిగ్బంధంనుండి తమనుతాము రక్షించుకొంటూ కమ్యూనిష్టుసేనలు జపాన్‌తో యుద్ధం చేయవలసివచ్చింది. అప్పుడు రెండవ ప్రపంచయుద్ధం జరుగుతున్నది. యూరోపియన్ సామ్రాజ్యవాదానికి వలసలుగాఉన్న ప్రాచ్యదేశాలకు తాను స్వాతంత్ర్య ప్రదాత అయినట్లుగా జపాన్ కల్లబొల్లికబుర్లుచెప్పి

కొద్దిరోజులకే పెరల్‌హార్బర్ మీద దాడిచేసింది. 1941-1942లలో ఎర్రసేనకు, జపాన్ సేనలకు జరిగిన యుద్ధంలో అంతిమంగా ఎర్రసేనకే విజయం లభించింది. అధునాతన మైన ఆయుధాలు, సాధనసంపత్తిగల సామ్రాజ్యవాదం ఆయుధాలులేక, వైద్య సౌకర్యాలులేక, ఒకవైపు అంతర్యుద్ధాన్ని కొనసాగిస్తూ పోరాడిన ఎర్రసేన చేతిలో పరాజయాన్ని పొందింది. ఎర్రసేనకు ఓడిపోయిన జపాన్ సైన్యమే ఆయుధాలను ఇచ్చింది. చైనా రైతాంగం చేస్తున్న పోరాటం తమపోరాటంగా భావించిన నార్మన్ బెతూన్, కోట్నీసులవంటివారు ఎర్రసేనకు వైద్యసదుపాయాన్ని తమజీవితాలు బలి అయిపోయేంతవరకు సమకూర్చారు. చైనా పేదప్రజానీకం యావత్తు ఎర్రసేనను కడుపులోదాచుకొని రక్షించింది అందుకే 8వ మార్గసైన్యం జపాన్‌మీద దెబ్బమీద దెబ్బ తీయగలిగింది అయితే రెండవ ప్రపంచయుద్ధంలో ఓటమితో జపాన్ చైనాలో తోకముడిచింది కాని కొమింటాంగు నియంతృత్వం, అంతర్యుద్ధం అయిపోలేదు. మావో ఒకవైపు కొమింటాంగు నియంతృత్వంతో పోరాటం కొనసాగిస్తూనే మరొక ప్రజాతంత్ర మిశ్రమ ప్రభుత్వస్థాపనకు కృషిచేసాడు. ఎప్పటివలెనే చాంగ్-కై-షేక్ మిశ్రమ ప్రభుత్వస్థాపన ఒప్పందంమీద సంతకంచేసికూడ కమ్యూనిస్టులను తుడిచి పెట్టడానికి రహస్యప్రయత్నాలు కొనసాగించాడు. రెండవ ప్రపంచయుద్ధం తరువాత కొత్తగాతలెత్తిన అమెరికన్ సామ్రాజ్యవాదం ప్రజాస్వామ్యంపట్ల కుహనా గౌరవాన్ని చూపెడుతూనే ఎనిమిదవ మార్గసైన్యానికి వ్యతిరేకంగా కొమింటాంగులకు సహాయంచేసింది. సామ్రాజ్యవాదుల ప్రయోజనాలకు పాచికగా ఉపయోగపడుతున్న చాంగ్-కై-షేక్ దేశద్రోహపంకిలాన్ని కడిగివేయడానికి అసంఖ్యాకమైన చైనా ప్రజలు నెత్తురుటేరులను పారించవలసి వచ్చింది. చరిత్రలోని నియంతృత్వాలన్నింటి వలెనే కొమింటాంగు నియంతృత్వం పతనమయింది. చైనాపై అరుణతార ఉదయించింది.

"కమ్యూనిస్టుల మాటల్ని ఏళ్ళతరబడి సానుభూతితో విన్నాను. ఆ తరువాత వాళ్ళకి నా క్రియాశీల సహకారం అందించాను. కాని కమ్యూనిస్టు నాయకుల సేవకి నా మనస్సుని, నా జీవితాన్ని మారుమాటాడకుండా అర్పించలేను. నేనొక్కదాన్నే గొప్ప తెలివిమంతురాల్నని నేనెన్నడూ భావించలేదు. కాని సత్యాన్ని ఆవిష్కరించే ఏకైక కీలకసూత్రం తమ గుప్పిట్లో ఉందని భావించే మనుషుల చేతుల్లో నేను కీలుబొమ్మకాలేను." అన్న ఎగ్నెస్ స్మెడ్లీ రాసిన ఛూటే జీవితచరిత్ర ఇది. ఆమె ఒక జర్మన్ పత్రికకు విలేఖరిగా 1928లో చైనాకు వచ్చింది. చైనాలో కమ

నాయకత్వంలో ప్రజలు చేస్తున్న విముక్తి పోరాటంచూచి ఆమె దానితో మమేకం చెందింది. చైనా పరాయిదేశం అన్న విషయంకూడ మరిచిపోయింది. కమ్యూనిస్టులతో తనకున్న భేదాభిప్రాయాల్ని వదులుకోకుండానే కమ్యూనిస్టులకు, వారి పోరాటానికి తాను చేయగలిగినంతా చేసింది. అమెలో ఉన్న ఈనిజాయితీ ప్రశంసించదగింది చూతే వ్యక్తిత్వం ఆమెను ఆకర్షించి అతని జీవితచరిత్ర రాయడం కొరకు అతనితో ధారావాహికంగా సంభాషణలు జరిపింది. ఈ సంభాషణల్లో 1937 వరకు వివరాల్ని ఆమె చూతే నుండి విన్నది. ఆ వివరాలను ఈ పుస్తకంలో చెప్పినతీరు స్మెడ్లీదే. ఆ తరువాత దాదాపు మరో పదేళ్ళ చైనా విప్లవ పోరాట చరిత్రను సంక్షిప్తంగా రచయిత్రి పొందుపరిచింది. ఈ జీవితచరిత్ర మొదట జపాన్ భాషలోనూ, తరువాత 'The Great Road: The Life and Times of Chu-Teh' పేరిట ఆంగ్లంలోనూ వెలువడింది. దాని సంక్షిప్తీకరణే ఈ పుస్తకం.

'చైత్రయాత్ర' పేరిట తెలుగులోకి 'సహవాసి' చేసిన అనువాదం ఇది. అనువాదం బాగానే సాగింది. ఈ పుస్తకంలో అచ్చుతప్పులు చాలఉన్నట్లు ప్రచురణకర్తలే ఒప్పుకొన్నారు.

— గంగాధర్

---

చైత్రయాత్ర- ఎగ్నెస్ స్మెడ్లీ; తెలుగు సహవాసి; ప్రచురణ : హైదరాబాద్ బుక్ట్రస్టు; పేజీలు 380; వెల: రు. 12/-లు; ప్రతులకు: హైదరాబాద్ బుక్ట్రస్టు 3-6-694, హిమాయత్‌నగర్, హైదరాబాద్ - 500 029.

# నాకుటుంబం

చైనా కమ్యూనిస్టుపార్టీ చరిత్ర మావోచరిత్ర అయినట్లు 1925-27 సంవత్సరాలలో జరిగిన మొదటివిప్లవ అంతర్యుద్ధచరిత్ర టావ్‌చెంగ్ కుటుంబజీవితం. ఈ కాలంలో చైనా కమ్యూనిస్టుపార్టీ నిర్వహించిన పోరాటాల చరిత్రను నవలరూపంలో టావ్‌చెంగ్ మనకందించింది. అరవైకోట్ల చైనాప్రజలకొరకు, వారిని భూస్వామ్య దోపిడీనుండి, సామ్రాజ్యవాదుల దోపిడీనుండి, యుద్ధపతుల పీడననుండి విముక్తి చేసేందుకు, కమ్యూనిస్టులుపడిన కష్టాలు, త్యాగాలు ముఖ్యంగా టావ్‌చెంగ్ కుటుంబం లోని సభ్యులు చూపించిన ధైర్యసాహసాలు, త్యాగాలు "నాకుటుంబం" నవలలోని కథావస్తువు

ఈ నవల చదువుతుంటే ఆ కుటుంబానికి కమ్యూనిస్టుపార్టీ, పోరాటం మినహాయించి వేరేజీవితం, ప్రజలసమస్యలుతప్ప మరోసమస్యఉన్నట్లు మనకుతోచదు. ఇందుకుసాక్ష్యాలు నవల చివరలో రచయిత్రిఅన్నమాటలు. పోరాటంలో భర్తను బిడ్డను, కొడుకును కోల్పోయినా తనలోతాను అనుకున్నమాటలు.

"........నాకుటుంబం బాధపడ్డమాట వాస్తవమే, కాదనను కాని శత్రువింకా ఎన్నికుటుంబాలను నాశనంచేయలేదు. మిగతాతల్లులు- తమపిల్లలను పోగొట్టుకోకుండా ఉండేందుకే నాపిల్లలు తమప్రాణాలర్పించారు."

మహోన్నతమైన ఆశయాలకొరకు ఎల్లప్పుడు సర్వం త్యాగం చేసేందుకు సంసిద్ధంగాఉన్న కమ్యూనిస్టు విప్లవకారులుమాత్రమే అమాటలు అనగలుగుతారు అనేది ఈ నవలచదివిన ప్రతివ్యక్తికీ అర్థమవుతుంది.

టావ్‌చెంగ్ మరియు మైషెంగ్ ఇరువురూ బాల్యంలోనే తల్లి దండ్రులను కోల్పోతారు. 17 ఏళ్ళ టావ్‌చెంగ్‌కి 16 ఏళ్ళ మైషెంగ్‌కి వివాహమయ్యాక కొద్ది రోజులకే పాఠశాలనడుపుదామనే ఉద్దేశ్యంతో షెచువాన్‌కుపోతాడు. కాని అక్కడి యుద్ధపతులు పాఠశాలను మూయించుతారు.

"మనిషి కేవలం ప్రస్తుతాన్నిగురించీ తన స్వంతవిషయాలగురించి ఆలోచించ గూడదు. తన తనను కుటుంబ వ్యవహారాలకే పరిమితం చేసుకోగూడదు మనిషికి కొన్ని బాధ్యతలున్నాయి"అంటూ ఉండే మైషెంగ్, దోపిడీకి, పీడనకు వ్యతిరేకంగా కార్మికులు, కర్షకులు, విద్యార్థులు కమ్యూనిస్టుపార్టీ ఆధ్వర్యంలో పోరాటంచేస్తుండగా తనవంతుకర్తవ్యాన్ని నిర్వహించడానికి పార్టీసభ్యత్వం తీసుకుంటాడు. అప్పటినుండి అతడు అతని కుటుంబం చైనాప్రజల విముక్తికొరకు అంకితమైపోతుంది.

చాంగ్ షా నగరంలోకి ఉత్తర యాత్రా సైన్యం ప్రవేశించింది. మైషెంగ్ ఇంటికిరావడం అరుదైపోయింది. కార్మికసంఘ కార్యక్రమాల్లో పాల్గొంటూ యుద్ధ భూమికి మందుగుండుసామాగ్రి చేరవేస్తూ తనఖీదళాలకు తరగతులునిర్వహిస్తూ ఎప్పుడోగాని. ఇంటికిపోవడం జరుగుతూఉండేది.

విప్లవసైన్యం నగరంలో ప్రవేశించాక నగర పౌరుజీవితంలో పెద్దమార్పు వస్తుంది. వ్యాపారస్థులు సరుకులధరలు తగ్గిస్తారు. ఇంటియజమానులు అద్దెవిషయం లో పెద్దగా పట్టించుకోవడంలేదు. కాని జపాన్, బ్రిటిష్ వ్యాపారస్థులు ఎప్పటిలాగే వ్యవహరిస్తారు. కార్మికులు వారిసరుకులను ఓడలకెత్తడం, ఓడలనుండి దించడం మానుకుంటారు. ఒకరకంగా వాళ్ళను సాంఘికంగా బహిష్కరిస్తారు. వాళ్ళసరుకులను బజారులో అమ్మకంచేయకుండా ఏర్పాట్లుచేస్తారు.

వయసుతో నిమిత్తంలేకుండా ఆలోచనాపరంగా ఎదిగిన పెద్దకొడుకు లి-యూన్ ఉత్తరయాత్రా సైన్యానికి స్వాగతంచెప్పటంకొరకు ఏర్పాటైన మీటింగ్‌లో ప్రసం గిస్తాడు, గస్తీతిరిగే బాలలదళం నాయకుడయ్యాడు. కాని తల్లికికాని తండ్రికికాని ఈ విషయం తెలియదు. పదిహేనుఏళ్ళుకూడ దాటని లియూన్‌కుకూడ దేశంకోసం, ప్రజలకోసం పార్టీలో పనిచేయాలనేతపన మొదలయింది.

1927 ఏప్రిల్ 12న చాంగ్ కై షేక్ కియాంగ్‌సు, చికియాంగ్ రాష్ట్రాల్లో అధికారం కైవసంచేసుకొని ఇళ్ళను ఫిరంగులతో నేలమట్టంచేయిస్తాడు, పాఠశాల లన్నింటిమీద దాడిచేయించి మూయించివేస్తాడు. కార్మికసంఘ. కర్షకసంఘ కార్యా లయాలను కమ్యూనిస్టుపార్టీ ఆకాడమీ మున్నగు ప్రజాసంస్థలన్నింటిని దోచుకుంటాడు, అరెస్టుచేయాల్సినవారి పేర్లను ప్రకటిస్తాడు అందులో మైషింగ్ పేరుకూడాఉంటుంది. అప్పుడే మైషింగ్ ఇల్లువదిలిపెట్టి వెళ్ళిపోతాడు.

మైషెంగ్ ఇల్లువదిలిపోయాక టావ్‌చెంగ్ ఇంట్లోఉన్న కొన్నిబట్టలుఅమ్మి సిగి రెట్లు, అగ్గిపెట్టెలు, కొన్ని తినేవస్తువులుకొని వాటిని పిల్లలచేత ఓడరేవులలో అమ్మించి వచ్చే కొద్దిలాభంతో రోజులుగడుపుతూ ఉంటుంది. ఆరోజుల్లోనే కూతురు పెవ్ షు లాంగ్‌కు జబ్బుచేస్తే మందులు ఇప్పించేస్థోమతలేక చనిపోతుంది. కొద్దిరోజులకే పార్టీ ఒకకామ్రేడ్‌నుపంపి టావ్‌చెంగ్ కుటుంబయోగక్షేమాలు తెలుసుకురమ్మని పంపిస్తోంది. వచ్చిన కామ్రేడ్ ఏమైనా అవసరాలుంటే చెప్పమని అడిగినపుడు, ప్రజలుచేస్తున్న త్యాగాలు, పార్టీ ఆర్థికఇబ్బందులను గుర్తుకుతెచ్చుకొని ఏమి అడుగదు

పోగా కూతురుమరణం గురించిచెబితే పార్టీ ఎక్కడబాధపడుతుందో అని భావించి ఆ విషయంకూడ చెప్పక కడుపుకోతబాధను తనలోనే దాచుకుంటుంది.

మైషెంగ్ వూహాన్‌లో ఉన్నాడని పార్టీ కామ్రేడ్‌ద్వారా తెలుసుకొని, కలుసుకునేందుకు బయలుదేరుతుంది. అక్కడిపరిస్థితి ఏమాత్రం బాగాలేదని, వూహాన్ పోవద్దని, ఇక్కడ ఏమైనా ఇబ్బందిగాఉంటే పార్టీ సహాయంచేసేందుకు ప్రయత్నం చేస్తుందని పార్టీ కామ్రేడ్ నచ్చచెప్ప ప్రయత్నిస్తాడు. అప్పుడు టావ్‌చెంగ్ అన్న మాటలు.

"అట్లాఅయితె తప్పకవెళ్ళాలి. మైషెంగ్‌ను ఒంటరిగా కష్టాలనెదుర్కోనివ్వను. ఇంతమందిప్రజలు తమప్రాణాలర్పిస్తుంటే నేను చేతులుముడుచుకొని ఒడ్డున నిలబడలేను."

టావ్‌చెంగ్‌ను ఒప్పించలేక వచ్చిన కామ్రేడ్ రెండుఅడ్రసులుఇచ్చి వూహాన్ వెళ్ళి ప్రయత్నించమని వెళ్ళిపోతాడు. టావ్‌చెంగ్ కుటుంబం వూహాన్‌వెళ్ళి ఎలాగోలాగు మైషెంగ్‌ను కలుసుకుంటుంది.

వూహాన్‌పరిస్థితి తీవ్రంగాఉంది. విప్లవ ప్రతిఘాతుకులు, విప్లవకారులను, సాధారణ ప్రజానీకాన్ని చిత్రహింసల పాల్జేస్తున్నారు. అమాయకులు, అనుమానితులు తుపాకీకాల్పులకు గురౌతున్నారు. బజారుకువెళ్ళడం భయంగా పరిణమించింది. హత్యలు, దోపిడీలు నిత్యకృత్యాలయ్యాయి.

మైషెంగ్ ఇంట్లోనే జిల్లాపార్టీ కార్యాలయం, కార్యాలయాన్ని, కామ్రేడ్లను రక్షించే బాధ్యతటావ్‌చెంగ్‌ది. పెద్దకొడుకులియాన్ వార్తాహరుడిగా చురుకుగాపని చేస్తూవుంటాడు రోజు పార్టీపత్రిక "టాకియాంగ్"ను నిర్ణీతప్రదేశాలకు చేరవేస్తుంటాడు. ఒకరోజు వాంగ్అనే కామ్రేడ్‌కి పత్రిక అందజేసేందుకువెళ్ళి గొళ్ళంకొడుతాడు. అప్పటికే ఆ ఇల్లును విప్లవ ప్రతిఘాతుకులు ఆక్రమించుకుంటారు. పెరుగుడబ్బులు వసూలు చేసుకునేందుకు వచ్చాననిబొంకి అక్కడినుండి సమయస్ఫూర్తితో తప్పించుకుంటాడు,

నగరమంతా ఒక అగ్నిపర్వతంలాగా లోలోపలనే రగులుకుంటూంది. పన్నుల భారానికి తట్టుకోలేక దుకాణాలు, ఫ్యాక్టరీలు మూసివేశారు ఫలితంగా చాలామంది నిరుద్యోగులయ్యారు. పరిసరప్రాంతాల్లో పోరాటం తీవ్రరూపం దాల్చింది. వూహాన్‌లో తిరుగుబాటుకు అవసరమైన పథకాన్ని తయారుచేశారు. ఆయుధ నిర్మాణశాల వారితో సంప్రదించారు. ఆయుధాలకొరకు హువాంగ్, యాంగ్‌హ్సింగ్‌ఫా అను ఇరు

వురు కామ్రేడ్లకు ఆబాధ్యత అప్పగించబడింది. శత్రువుపసిగట్టడం మూలంగా ఆయుధాలు సంపాదించలేక పోయారు. హువాంగ్ పట్టుబడుతాడు. కాల్పులను తప్పించుకొని నదిలోదూకి బయటపడతాడు యాంగ్ హ్స్వింగ్-షా.

వూహాన్‌ప్రాంతాల్లో తాత్కాలికంగా తిరుగుబాటును అపివేయమని కేంద్ర కమిటీ ఆదేశిస్తుంది. మైషెంగ్, చాంగ్‌హావో, లుంగ్ టా-టావో రాత్రంతా పరిస్థితుల్ని గురించి కూలంకషంగా చర్చలుజరిపి ఒకనిర్ణయానికొస్తారు. మైషెంగ్ రాష్ట్రకమిటీకీ నివేదికరాసేందుకు ఉపక్రమిస్తాడు. నివేదికచివరపేజీ రాస్తూరాస్తూ పడిపోతాడు. బయట గస్తీ ఉండటంమూలంగా తెల్లవారాక హాస్పిటల్‌కి తీసుకెళ్ళతారు, కొద్దిసేపటికే మెదడులో రక్తప్రసార తీవ్రతచేత (సెరిబ్రిల్ హైపరీమియా) చనిపోతాడు.

మైషెంగ్ చనిపోయిన కొద్దిరోజులకే టావ్‌చెంగ్ బంధువొకాయన స్వగ్రామానికొస్తే ఏదోవిధంగా బతకవచ్చు అని ఉత్తరంవ్రాస్తాడు. కాని అతనిసలహాను పాటించలేదు. మైషెంగ్ చెప్పాడు తానుచనిపోతే ఏంచేయాలో అదే "పార్టీని అనుసరించు !" ఆయన పోయాడుగనుక ఆయన విశ్వాసాలకు వ్యతిరేకంగా నడచుకోవడం సరికాదు, యోధుడుకూలాడు. అయినా బతికిఉన్నవారు ఆ ఆశయాలపతాకను ముందుకు తీసుకుపోవాలి" అతని సలహామేరకు చాంగ్ హావోను కలుసుకుంటుంది. "నీవు ఇక్కడ ఉండడమే మంచిదనిచెప్పి 200 డాలర్లు చేతిలోపెట్టి మొదట నివాసం ఏర్పరచుకొమ్మంటాడు చాంగ్ హావో.

"నాకు డబ్బుఅవసరంలేదు. ఎట్లాగో గడుపుకోగలను. పార్టీ నాకు ప్రత్యేక సదుపాయాలు కల్పించడం నాకిష్టంలేదు. ఒక స్నేహితుడిభార్యగా చూడబడడం నాకిష్టంకాదు మీ కామ్రేడ్‌గా చూడబడాలి" అంటుంది టావ్‌చెంగ్.

మైషెంగ్ చనిపోయిన 9 రోజులకే వాంగ్ అనే ద్రోహిఇచ్చిన అడ్రసు ఆధారంగా పోలీసులు టావ్ చెంగ్‌ని అరెస్టుచేస్తారు. ఇంటరాగేషన్ పేరుతో వారం రోజులు స్టేషన్‌చుట్టుతిప్పి చివరకు వదలిపెడుతారు.

టావ్‌చెంగ్ చిన్న సిగరేట్ల దుకాణంపెట్టుకొని అరెస్టయిన కామ్రేడ్లను దుకాణం పూచి చూపించి విడిపించడం, వారిని పోలీసులబారినుండి రక్షించడం రహస్య పత్రాలు దాచడం, సమాచారాలు అందజేయడము రోజూ కార్యక్రమం. కొద్దిరోజుల్లోనే నిర్బంధము పెరిగిపోయింది. దుకాణంమూయించి టావ్‌చెంగ్‌ని షాంఘైకి వెళ్ళిపొమ్మని పార్టీచెప్తుంది.

కూతురు పెన్‌వెన్‌తోకలసి టావ్‌చెంగ్ షాంఘై చేరుకుంటుంది. ఒక నూలు మిల్లులో తల్లికూతురు పనిచేస్తూఉంటారు, పార్టీని కలుసుకోలేకపోతారు. పెద్ద కొడుకు లియూన్ తరువాతవాడు ఇంగ్‌ఛీన్‌కూడ అక్కడికి చేరుకుంటారు. ఒక ఇంజనీరు సహాయంతో లియూన్‌కూడ ఒక ఫ్యాక్టరీలో కార్మికుడిగా చేరుతాడు. కాని టావ్‌చెంగ్‌కి లియూన్‌కి ఏవిధంగాను తృప్తి కలిగించదు వారిజీవితం, కారణం పార్టీని కలుసుకోలేక పోవడం, పార్టీపని చేయజాలక పోయినందుకు.

ఒకరోజు చాంగ్ అనేకామ్రేడ్ టావ్‌చెంగ్ ఇంటికొచ్చి ఒకపనిఉంది చేస్తావా అని అడిగినపుడు "పార్టీకొరకైతే సిద్ధమే" అంటుంది టావ్‌చెంగ్.

జిల్లా పార్టీసమితి కార్యదర్శిభార్య చనిపోయింది. అతడిపిల్లలకు రక్షణభారం వహించాల్సిందిగా కోరుతాడు చాంగ్.

"నేను దానికే అవసరమైతే ఎందుకు చేయను"

"నువ్విష్టపడవనుకున్నాను. నీ కుటుంబమే ఎంతో పెద్దదాయె. పైగా ఇదొక పనిమనిషి పని"- అంటాడు.

"ఎంత నీచమైనభావం. ఎంత మురికీభావాలునీవి. ఒక పనిమనిషి ఒక విప్లవకారునికి ఇంటిపనుల్లో సహాయపడితే తప్పేమిటి ? నేనతడిపిల్లలను చూసుకుంటే అతను తనపనిలో మనసుపూర్తిగా లగ్నంచేయవచ్చు. అది విప్లవానికి దోహదం చేసినట్లు అవుతుందికదా ! అవునాకాదా?" అంటూ ఎదురుప్రశ్న వేస్తుంది.

ఏదో ఒక రూపంలో చేతనైనంతా విప్లవానికి, పార్టీకి దోహదపడాలనేది ఆ కుటుంబంలోని ప్రతిసభ్యుడి నరనరాన జీర్ణించుకుపోయింది.

పార్టీ స్వంతముద్రణాలయం పెట్టాలనుకుంటుంది. అందులో నీ రెండవ కొడుకు యింగ్‌చీన్ పనిచెయ్యాలని పార్టీ అభిప్రాయపడినట్లు అందుకు నీకేమైనా అభ్యంతరమా ? అనికూడ అడుగుతాడు.

అప్పుడు ఆతల్లి ఏమాత్రం సంకోచించకుండా ఇలాఅంటుంది. "విప్లవానికి అబ్బాయిలు అవసరంకనుక తీసుకుపో. నేను విప్లవానికి చెందినదాన్ని అలాగే నా పిల్లలు"

అదేరోజు సాయంత్రం జిల్లా పార్టీసమితి కార్యదర్శి హోమెంగ్-హ్వాయింగ్ పిల్లలను తీసుకొని టావ్‌చెంగ్‌వద్దకు వస్తాడు. మిల్లుఫోర్మెన్‌తో తగువుపెట్టుకొని ఉద్యోగం వదిలిపెట్టి ఇంటికివస్తాడు లియూన్. పార్టీకార్యదర్శి లియూన్‌నుచూసి రేపటినుండి నీకొడుకును నాతో తీసుకెళ్తానంటాడు. ఆమాటకి టావ్‌చెంగ్ ఆనందాన్ని ఆశ్చర్యాన్ని వ్యక్తపరుస్తుంది. తమ తనపిల్లలు విప్లవంకొరకు పనిచేసే అవకాశం లభించినందుకు,

కొద్దిరోజులలోనే టావ్‌చెంగ్ ట్రేడ్‌యూనియన్ కార్యాలయంలో పనిచేయడం మొదలెడుతుంది. ఆ తరువాత నెలరోజులకే కమ్యూనిస్టు యూత్‌లీగ్ కేంద్ర సమితి కార్యదర్శిత్వశాఖకు మార్చబడుతుంది. పెద్దకొడుకు లియూన్ పార్టీకార్యదర్శితో, రెండవవాడు యింగ్‌చీన్ ప్రెస్‌లో పనిచేస్తూఉంటారు. కూతురు పెన్‌వెన్ నూలు మిల్లులో పనిచేస్తూఉంది.

నాంకింగ్, హ్వాకువాంగ్ జిల్లాలోని హోచి ఫ్యాక్టరీలో సమ్మెజరిగింది. క్రూర బ్రిటిష్ నావికుల తుపాకిగుండ్లకు చాలామంది కార్మికులు బలైపోతారు. పార్టీలోని వామపక్ష అవకాశవాదం మూలంగా తాత్కాలికంగా కొంతనష్టం జరుగుతుంది ఎర్ర సైన్యం గెరిల్లాదాడులమీద కేంద్రీకరించడం, సోవియటు ప్రాంతాలను ఏర్పరచ డానికిబదులు సార్వత్రిక తిరుగుబాటుకు పిలుపు ఇవ్వబడింది. సామ్రాజ్యవాదుల దురంతాలను నిరసిస్తూ, సమ్మెలను బలపరుస్తూ బహిరంగసభ ఒకటి ఏర్పాటు చేస్తారు. అదేరోజున టావ్‌చెంగ్ కూతురు షువాంగ్ లిన్ జ్వరంతో చనిపోతుంది. పెద్దకూతురు పెన్‌వెన్ కొడుకు లియూన్ సభకుపోతారు. ఆసభ ఇంటర్నేషనల్ సెటి ల్మెంట్ పోలీసులకు కార్మికులకు పోరాటంగా మారుతుంది.

పోలీసుల దౌర్జన్యం, చెల్లెలిమరణం ఏవీ లియూన్‌నికాని పెన్‌వెన్‌కాని ఏ మాత్రం కుంగదీయలేదు. పైగా మరింత నూతనఉత్సాహంతో పనిచేస్తూవేఉంటారు. కొద్దిరోజులకే లియూన్ అంతర్జాతీయ శ్రామికదినంనాడు సభ ఏర్పాటుచేస్తాడు. పెన్‌వెన్ జెండా ఎగురవేస్తుంది, అందుకు పెన్‌వెన్‌ను నలభైరోజులకుపైగా జైలులో నిర్బంధించి విడుదలచేస్తారు.

క్రిమశిక్షణారీత్యా లియూన్‌కు ఇంటికిరావడం వీలుపడలేదు. తల్లికి తెలుప కుండానే అంతర్జాతీయ యువకార్మికుల సమావేశానికి మాస్కో వెళ్ళి తిరిగి వస్తాడు.

1930 లోపార్టీ తీవ్రనష్టాలకు గురవుతుంది. చాంగ్ కైషేక్ లక్షమంది సైనికుల ను సమీకరిస్తాడు కాని అతడి ప్రధాన సేనానిని ఎర్రసైన్యం పట్టుకొని ఉరితీస్తుంది

ఓటమితో రెచ్చిపోయిన చాంగ్ కైషేక్ కొద్దిరోజుల్లోనే రెండులక్షల సైన్యాన్ని సమీకరించి కేంద్రి విప్లవస్థావరంపై దెబ్బతీయడానికి సిద్ధమవుతాడు. సరిగ్గా అదేసమయంలో లియూన్ మిగతా 30మంది కామ్రేడ్ల షాంఘై అంతర్జాతీయనివేశన ప్రాంతంలోని హాంకి రోడ్డులోనున్న ఫార్ ఈస్టరన్ హోటల్‌లో సమావేశం అవుతుంటారు. ఒకద్రోహి ఇచ్చిన సమాచారం ఆధారంగా పోలీసులు హోటల్‌ను చుట్టుముట్టి కామ్రేడ్లందరిని అరెస్టు చేస్తారు.

రహస్యవిచారణలో, అందరికన్నా ఎక్కువ క్రూర చిత్రహింసలకు లియూన్ గురిఅవుతాడు. మంటల్లోకాల్చడం, కరెంటు షాక్‌లుపెట్టడం, పొగపెట్టి ఊపిరిసలపనివ్వక పోవడంలాంటి పద్ధతులలో హింసించినాకూడ ఏ ఒక్కరహస్యాన్ని బయట పెట్టలేదు. లియూన్‌ను గుర్తుపట్టేందుకు ద్రోహినిరప్పిస్తాడు శత్రువు.

ఆ ద్రోహి "ఇతనిపేరు ఉయాంగ్ లియూన్. షాంఘై కార్మికసంఘానికి నాయకుడు. కమ్యూనిస్టు యూత్‌లీగ్ కమిటీసభ్యుడు. ఇతడికుటుంబమంతా కమ్యూనిస్టులే" అంటాడు.

"సిగ్గుదప్పిన ద్రోహి" అంటూ నిప్పులుకురిపిస్తాడు లియూన్.

"అయితే నీవు లియూన్‌వనీ, కమ్యూనిస్టువనీ ఒప్పుకుంటున్నావన్నమాట" అన్నాడు జడ్జీ లేని ఉత్సాహాన్ని నటిస్తూ" ఆఁ ఇంకేమున్నాయి విశేషాలు,"

"వినాలని ఉబలాటంగాఉందా? చెప్తాను.... ఈ చైనావిప్లవం జయించడం, కొమింటాంగ్ నశించడంతథ్యం. ఆఁ అవును నేను కమ్యూనిస్టునే. నన్ను కాల్చిన బూడిదకూడ నూటికి నూరుపాళ్ళు కమ్యూనిస్టుగానే ఉంటుంది. ఆ ఆదర్శంకొరకు, ప్రజలకొరకు, నిర్విచారంగా ప్రాణాలర్పిస్తాను."

తరువాత కొద్దిరోజులకు లియూన్‌ను మిగతా కామ్రేడ్లని నాంకింగ్ తీసుకెళ్ళి అక్కడ కాల్చిచంపుతాడు శత్రువు.

చిన్నకొడుకు చిహో సైన్యంలోచేరి 1940లో పోరాటంలో మరణిస్తాడు.

మార్క్స్ అంటాడు "కష్టాలులేని జీవితం నాకొద్దు" అని అలాగే టావ్‌చెంగ్ కుటుంబంకూడ చైనాప్రజల విముక్తికొరకు సుఖాలను తిరస్కరించి, కష్టాలను వరించింది. ఈ కుటుంబాన్ని అంతగా ప్రేరేపించిన మాటలు కామ్రేడ్ చాంగ్‌హావో మాటలు, వాటినే టావ్‌చెంగ్ మననంచేసుకుంటూ కన్నీళ్ళనుదాచుకొని కష్టాలను అధిగమించి త్యాగాలకు వెనుదీయక పోరాటబాటలో నడిచింది.

# శ్రీకాకుళ పోరాటం - సాహిత్యం

చలసాని ప్రసాద్

తెలుగుదేశంలో ఒక కొసనవుంది శ్రీకాకుళం. అందరిదృష్టిలో అది ఎన్నాళ్ళుగానో వెనకబడ్డప్రాంతం. అయినా 1965 తర్వాత అది అందరిదృష్టిని ఆకర్షించింది, అక్కడకదిలింది రైతాంగశక్తి, పట్టిందితుపాకి. దీర్ఘకాలిక సాయుధ పోరాటానికి శ్రీకారంచుట్టింది, శత్రువర్గాలు నేలకూలాయి. ప్రజలు విజయపరంపర సాధించారు, అందుకే

ఈ విప్లవాగ్నులు ఎచటివని అడిగితే
శ్రీకాకుళమువైపు చూడమనిచెప్పాలి

అంటూ ప్రజలగుండెల్లో నగారామోగింది.

శ్రీకాకుళంజిల్లా పేరుకు వినకబడ్డదేగాని సహజవనరులకు లోటులేదు. ఎందుకంటే ఒకపక్క వంశధార, నాగావళి, సువర్ణముఖి జీవనదులు; ఇంకోపక్క పాలకొండ, పార్వతీపురం, సోంపేట, పాతపట్నాలను పెనవేసే ఏజన్సీప్రాంతం; మరోవైపు చెక్కలి, సోంపేట, ఇచ్ఛాపురం తాలూకాలో వ్యాపించే విశాలమైన సముద్రతీరప్రాంతం, దీన్నే ఉద్దానం అంటారు. అక్షరాలా అది ఉద్యానవనం. ఈ రకంగా అడవులు, కొండలు, నదులతో అలరారే శ్రీకాకుళంజిల్లాలో ప్రజలు ఎందుకు నిరు

---

"....మనమెప్పుడూ భవిష్యత్‌మీదే దృష్టినిలపాలి. అప్పుడే ఉత్కృష్టవిషయాలను అశించగలం, అప్పుడే తాత్కాలిక ఆటంకాలేవి మననడ్డగించజాలవు. ఎల్లోకేన్ టవర్‌క్రింద నిలబడిచూడు. అది ఎత్తుగా కనిపిస్తుంది, అదే టార్దాన్ గుట్టమీద నిలబడి కిందికిచూడు అది బహుఅల్పంగా కనబడుతుంది. నీవు పైకివెళ్ళినకొద్దీ దృష్టి విస్తరిస్తుంది, అప్పుడు భవిష్యత్తంతా ఒక సమగ్ర దృశ్యంగా నీకు సాక్షాత్కరిస్తుంది."

ఈ నవల చదువుతున్నంతసేపు ప్రచురణకర్తల మాటలుకూడ మనకు గుర్తుకొస్తుంటాయి.

"....కమ్యూనిజం అత్యున్నత మయిన మానవతా వాదమని, స్వచ్ఛమైన కన్నీళ్ళు కర్తవ్యంతో కరిగిపోతాయని అనుభవమూ, శాస్త్రమూ బతుకుబండిని ముసుముందుకు నడిపించే పట్టాలని ఈ నవల మనకు చెపుతుంది."

అందమైన అట్టమీదిబొమ్మతో అందుబాటులోఉన్నధరలో కూడిన ఈ సృజన ప్రచురణను అందరూ చదవాలి చదివించాలి.

— ఇ. ఎల్. నర్సింహయ్య

పేదలుగా మిగిలిపోయారు? సహజసంపదలపై యాజమాన్యం ప్రజలదికాదు. కొండలచుట్టూవున్న భూస్వాములు, కొండలమధ్యనచేరిన వ్యాపారులు గిరిజన రైతాంగాన్ని పీల్చిపిప్పిచేశారు. మొత్తం రైతాంగంఅంతా దోపిడీ విషవలయాల్లోపడి నలిగి అస్థిపంజరాల్లా మిగిలిపోయారు.

స్వతంత్రం వచ్చాకకూడా అదేపరిస్థితి. ఆనాడు అంటే 1947 ఆగస్టు 15న అధికారమార్పిడి జరిగింది. నల్లదొరలు గద్దెకెక్కాక ఏ ప్రజాసమస్యను పరిష్కరించలేకపోయారు. వేసిన గొంగళి వేసినచోటేవుంది. ఆమాటకొస్తే ఇంకా వెనక్కుపోయిందికూడా. ఈ మాటే 'యజ్ఞం' కథలో (1964) నొక్కిచెప్పారు కాళీపట్నం రామారావుగారు. శ్రీకాకుళం జిల్లాలోని దోపిడీని ఆయన గొప్పగా కళ్ళకుకట్టారు. దోపిడీవ్యవస్థలో ఒక నిండుకుటుంబం ఎలా చితికిపోయిందో చిత్రించారు. సీతారాముడు కన్నకొడుకును బలిసరకడంతో కథముగుస్తుంది. 'యజ్ఞం' అయితే ముగిసింది కాని దానిమీద వాద వివాదాలకుమాత్రం ముగింపు కనుచూపుమేరలో కనపడడంలా. శ్రీరాములునాయుడులో మనకు నెహ్రూ ప్రత్యక్షమవుతాడు. అతన్ని నమ్ముకున్న అప్పలాముడు ఆనాటి మన సర్దారు కమ్యూనిస్టులు. 'అప్పలాముడు బతికించి చంపించాడు. కాని సీతారాముడు చంపించి బతికించాలని కన్నకొడుకుని నరికేసి "నువ్ మమ్మల్ని సచ్చిందాకా బానిసబతుకులు బతకమన్నావ్- నాకొడుకు బానిసబతుకు బతకగూడదు" అని తెగేసి చెప్పాడు. అయితే సీతారాముడు తిరగబడ్డాడేగాని విముక్తిమార్గం వెంట పయనించలేదు.

ఈ పరిస్థితి పోవాలంటే ఈదేశంలోని పాలకవర్గాలు మారాలి. దున్నేవానికే భూములుదక్కాలి. దేశీయ విదేశీ దోపిడీనశించాలి. శ్రామికవర్గ నాయకత్వాన రైతాంగ విప్లవాలు జయప్రదంకావాలి. నూతన ప్రజాస్వామిక వ్యవస్థ నెలకొల్పాలి. ఇవన్నీ ఒనగూడాలంటే, ప్రజాయుద్ధపంథా ఒకటేమార్గం. అదే నక్సల్బరీమార్గం. భారత రాజకీయాల్లో గొప్పమలుపు. నక్సల్బరీలోరేగిన విప్లవ శ్రీకాకుళంలో విప్లవజ్వాలగా చెలరేగింది. అదే శ్రీకాకుళ గిరిజన రైతాంగ సాయుధపోరాటం.

ఈపోరాటంలో గిరిజనరైతాంగం తలెత్తుకు నిలబడగల్గింది. అదే మన ప్రభువులకు కన్నెర్రఅయింది. వేలాదిరైతులను నిలువునా కాల్చిచంపింది కసాయికాంగ్రెసు ప్రభుత్వం. వందలాది విప్లవ కార్యకర్తలను పోలీసులు పొట్టనబెట్టుకున్నారు. ఇంచుమించు రెండువందల గ్రామాలను మిలటరీ నేలమట్టంచేసింది. ప్రజలసంపదనులూటీ

చేసింది. రైతులను మూకుమ్మడిగా అరెస్టులు చేసింది. ప్రభుత్వ దమనకాండను శ్రీపతి 'తూరుపు' కథలో తూర్పారబట్టారు.

ఇవన్నీ ఒకఎత్తు, నక్సలైట్ కుట్రకేసు ఒక్కటీ ఒకెత్తు. పార్వతీపురం కుట్ర కేసుగా ఇది పేరుగాంచింది. దీనిని ప్రభుత్వం బనాయించింది. ప్రపంచ చరిత్రలో కనీవినీ ఎరుగనిది. ఇందులో 140 మంది ముద్దాయిలు, వెయ్యిమంది సాక్షులు. "నిజానికిది కుట్రకాదు, అసలుకుట్ర వేరేవుంది. అదే మనరాజ్యాంగం, మన మిశ్రమ ఆర్థిక విధానం"- అంటూ కారా 'కుట్ర' కథలో బట్టబయలు చేశారు. ఈ కథను అన్ని భారతీయ భాషల్లోకి అనువాదంచేసి మన పాలకవర్గాల దోపిడీస్వభావాన్ని అందరికీ తెలియజెప్పాలి. అందుకే ఈ కుట్రకేసులో ముద్దాయి సత్యమూర్తి ఈకుట్రను కవితాపరంగా చిత్రించారు.

శ్రీకాకుళంలో సూర్యోదయం కుట్రకాదు
గెరిల్లా సూర్యుడు కుట్రకాదు
విండుచూలాలి ప్రసవవేదన కుట్రకాదు

సాహిత్యానికి సంబంధించినంతవరకు శ్రీకాకుళ పోరాటంలో ఒక గొప్ప విశేషముంది. సాహిత్యాన్ని అది బైటనుండి దిగుమతిచేసుకోలేదు. పోరాటంలోంచే పాటలు పుట్టాయి. పోరాటంలో పాల్గొన్నవారే పాటలుకట్టారు. అంతా కలిసికట్టుగా పాడుకున్నారు.

తూర్పుదిక్కున ఇంత వెలుగేమిటని అడుగ
గిరిజనుల త్యాగాల జ్వాలలని చెప్పాలి

ప్రజలు తమవిముక్తిని తామే సాధించుకున్నట్టు తమకవులను, కళాకారులను తామే సృష్టించుకున్నారు. సుబ్బారావుపాణిగ్రాహి కవిమిత్రుడు, కళాకారుడు, కదనయోధుడు. ఎన్నోకవితలల్లుతూ, కథలు చెబుతూ నేలకొరిగిన ధీరుడు.

దిక్కు మొక్కు లేనిజనం
ఒక్కొక్కరు అగ్నికణం
అంటూప్రజాశక్తి కినివాశిపట్టి
కొండల పక్కన బండలుకొట్టే
ఓగిరిజనుడా ఇటురావయ్యా
పుట్టలపక్కన కట్టెలుకొట్టే

ఓగిరిజనుడా ఇటురావయ్యా

అని ఆప్యాయంగా ఎలుగెత్తి కేకేశాడు. అంతేకాదు,

అరెస్టులను సాగించి
ప్రజాశక్తినడ్డలేరు
అరచేతిని అడ్డుపెట్టి
సూర్యకాంతినాపలేరు

అని ప్రభుత్వం నిర్బంధవిధానాన్ని, దమననీతిని తూర్పారపట్టి గిరిజనులకు గుండె ధైర్యాన్ని పూదాడు.

వెంపటాపుసత్యాన్ని అందరూ 'మాష్టార'ని ఎంతో ప్రేమగా పిలుచుకుంటారు. నీటిలో చేపలా గిరిజనులలో కలిసిపోయిన సాటిలేని మేటినాయకుడు అతను. అందుకే

వెంపటాపు సత్యము ఎవ్వరని అడిగితే
గిరిజనులె సత్యమని గొప్పగాచెప్పాలి
ఎర్రజెండా ఇంత ఎరుపేమిటనిఅడుగ
సత్యమూరక్తముతో తడిసెననిచెప్పాలి

అని ఇంటింటా పాడుకుంటారు.

పోరాటానికి నాయకత్వం వహించటంతోపాటు మంచి మంచి పాటలెన్నో రాశాడు.

కండబిగువు కలిగినట్టి
కొండజాతి వీరుడా
ఉప్పెనవలె ఒక్కసారి
లేచిముందుకురకరా

అంటూ గిరిజనులను వెన్నుతట్టి లేపాడు.

తెలంగాణా పల్లెపాట ఒరవడిలో శివుడురాసిన 'నరుడో భాస్కరుడా' అన్న గేయం విప్లవకవిత్వానికి ఓ కలికితురాయి. శ్రీకాకుళం పోరాటంలో ప్రాణాలుకోల్పోయిన డాక్టర్ చాగంటి భాస్కరావుమీద రాసిన గేయంఇది.

వరొరింక పెట్టుకింద నరుడోభాస్కరుడా
కన్నెర్రపేస్తివయ్యా నరుడో భాస్కరుడా
కన్నెర్రపేసినీవు నరుడోభాస్కరుడా

కదనానదూకితివా నరుడో భాస్కరుడా
బరెల్రింకపెట్టుకింద నరుడో భాస్కరుడా
బందూకుపడ్తివయ్యా నరుడో భాస్కరుడా
బందూకుసేతబట్టి నరుడో భాస్కరుడా
బంధాలుతెంచ్తివయ్యా నరుడో భాస్కరుడా

కవితా తత్వం ఒక్క శివుడికే తెలుసునన్నంత లోతువున్నదీపాటలో. అలాగే రెంజిమ్ రాసిన 'నాచెల్లీ చెంద్రిమ్మా' అన్నగేయకథ గురజాడ 'పుత్తడిబొమ్మ పూర్ణమ్మ'ను గుర్తుకు తెస్తుంది.

కొండకు ఆవల కారడవి వున్నాది
కొండకు ఈవల ఏరొకటి వున్నాది
ఏరుకు పక్కన పల్లొకటి వున్నాది
ఆపల్లెలో ఉన్నాది చెల్లీ చెంద్రిమ్మా

ఇందులో ఎన్నోపదాలు, ప్రయోగాలు శ్రీకాకుళం గిరిజనులగుండె నుండి వచ్చిననెత్తురు కాల్వలనిపిస్తుంది.

చిందిన నెత్తుర్లూ చేతుల్లో తీసికొని
నుదుట బొట్టుపెట్టుకుందా చెంద్రిమ్మ

ద్రౌపది

నిమునంపినీ నెత్రు
బొట్టెట్టుకుందు

అని కీచకుడిని నిలబెట్టి శిలవేసినట్టు శ్రీకాకుళంప్రాంతంలో ఓ పల్లెపాటలోవుంది. అలాగే 'తొలకరిజబ్బమబ్బు తొంగిచూసింది' అనే పాతపల్లెపాటను తన'కొక్కొరోకో' లో రెంజిమ్ తలుపుకుతెస్తారు.

కొక్కొరోకో అని కోడికూసింది
విదరబోయేసీమ కదలబారింది
ఏతమెత్తినవాడ ! ఏరుకట్టినవాడ !
నారుపోసినవాడ ! నీరుపోసినవాడ !
దుక్కిదున్నినవాడ ! మొక్కనాటినవాడ !
కలుపుతీసినవాడ ! కలతమోసినవాడ !

కోతకొచ్చినచేను కోతకోరింది
కోతకాలమే నిన్ను కోరిపిలిచింది
కత్తుకొట్టండిరా కొడవళ్ళకూ- ఇంక
పదును పెట్టండిరా కొడవళ్ళకు

శివసాగర్ 'ఉరిపాట' ఒకగొప్ప కవితాప్రవాహం. ఇందులో కదన కుతూహలం, వీరావేశం, గుండెనిబ్బరం, విప్లవదీక్ష ఓలలాడతాయి.

ఉరికంబం
మీదనిలిచి
చిక్కనికుతూహలు, చక్కనికుసుమలు గానంచేస్తున్నారు.
సూర్యుని
అరచేతపట్టి
రైతు
దుక్కిదున్నును
ఫ్యాక్టరీలో
చందమామ
మరచక్రం
తిప్పును

పోరాటం విడవొద్దని, ఎర్రజెండా విడవొద్దని, చేతిలోని బందూకును భద్రంగా నిలుపుకోమని మనకు నూరిపోస్తున్నాడు.

నారక్తం
వృధాకాదు
నామృత్యువు
వృధాకాదు
నానెత్తురు
కోనేరులో
నవలోకం
వికసించును
నామృత్యువు
సన్నిధిలో

జీవరవళి

వినిపించుము

ఈపాటలో కడలిగాంభీర్యం, కొండఔన్నత్యంకూడా కనపడతాయి.

ఇంతవరకు పోరాటంతో రక్తసంబంధమున్నవాళ్ళు రాసిన పాటలువిన్నాం. ఇక భావబంధువులు ఎలాగానంచేశారో చూద్దాం. వీరపూజలో తెలుగుజాతిది అగ్రతాంబూలం.

అన్నార్తుల అంగరక్షకులకు
గిరిజన క్రాంతికేసరులకు
రాలిన నిర్మలనక్షత్రాలకు

జ్వాలాముఖి తన 'ఆకాశం ఎర్రబడుతుంది'లో హారతిపట్టారు. శ్రీకాకుళ పోరాటం ఎందరోకవులకు ఉత్తేజం, ఉత్సాహం, ఉద్రేకం, ఆవేశం కలిగించింది. ఎన్నెన్నో కవిహృదయాలు స్పందించాయి.

శ్రీశ్రీ 'నిన్నటి ఆట్కావాలా'ను సికాకులం పంపేశారు. ఎందుకంటే

శ్రీకాకుళం అడవుల్లో చీమలు
పాముని చంపుతాయి

అంటూ ఉయ్యాలలూగించి, విప్లవం

నీగుండెలోనే కూకుందిరా
నీ కళ్ళలోనే దాగుందిరా
మనిషికొకటే సావుందిరా

అంటూ జనాన్ని ఉర్రూతలూగిస్తున్నారు శ్రీశ్రీ. శ్రీశ్రీరాసిన నేటిపాటలు స్మశానాల వంటి నిఘంటువులుదాటి జనతామైదానాలగుండా సెల్లాల గుండెలకొండల్లో మారు మోగుతున్నాయి.

ఉద్యమాలులేకుండా ఉత్తమకవులురారు. ప్రజాఉద్యమాలతోనూ, ప్రజా ఉద్యమాలునిర్మించే చరిత్రతోనూ సంబంధంలేకుండా సాహిత్య సాంస్కృతిక ఉద్యమాలుండవు. ప్రజాపోరాటాలనుంచే ప్రజాకవులు వస్తారు. నక్సల్బరి, శ్రీకాకుళం

పోరాటాలులేనిదే గద్దర్, వంగపండు ప్రసాదరావులాంటి కవులు రాలేరు. వీరి పాటలు ప్రజాయుద్ధ రాజకీయాలకుపల్లవి.

శ్రీకాకుళ పోరాటం ఉత్తేజంతో కవితలు పుంఖానుపుంఖంగా వచ్చాయి. కథలు డజనుకూడ దాటలేదేమో। నవలగా చెప్పుకోతగ్గది 'కొండగాలి' ఒక్కటే. తెలుగులో కవిత్వానిది ఎప్పుడూ ప్రథమస్థానమే. నవలాప్రక్రియ మనకు ఇంకా ఇంకా పెరగాలి. తెలుగు సాహిత్యంలో గొప్ప నవలలు లేని లోటు కొట్టొచ్చినట్టు కనిపిస్తోంది. కేవలం స్పందనతో కవిత్వం అల్లవచ్చునుగాని రక్తసంబంధంలేనిదే నవలలు రాయలేరు. పోరాట పూర్వరంగాన్ని కా.రా. గారి 'యజ్ఞం' చిత్రిస్తే. భూషణంగారి 'కొండగాలి' నవల పోరాటక్రమాన్ని చిత్రిక పట్టింది. ఉద్యమనాయకుని పట్టుదల. ప్రభావం, పార్టీ పాత్ర, ప్రజలచొరవ, వర్గశత్రువుల ఆగడాలు అన్నీ మనకీ 'కొండగాలి' నవలలో కళ్ళకు కట్టినట్లు కనబడతాయి.

కథలురాశిలో తక్కువేగాని వాసిలో ఎన్నదగినవి ఉన్నాయి. శ్రీకాకుళపోరాటం ఉత్తేజంతో చెరబండరాజు 'చిరంజీవి' కథరాశాడు. ఇందులో బాలగెరిల్లాని పోలీసు ఇనస్పెక్టరు పొట్టనపెట్టుకుంటాడు. ఆ బాలవీరుని హత్యకు ఉడుకెత్తిపోతాడు కనిష్టేబు రామయ్య. ఇనస్పెక్టరుని కాల్చి చంపుతాడు. విరసం కథల సంపుటి "ఇప్పుడు వీస్తున్నగాలి"లో ఈ కథ అచ్చయింది. బహుశా అందుకే ఈ పుస్తకాన్ని ప్రభుత్వం నిషేధించి ఉండవచ్చు. శ్రీకాకుళం పోరాటం మీద అయ్యో అయ్యో కథలు కొన్ని వచ్చాయి. గాలివాన, గడ్డిపరక. సానుభూతిలేకపోయినా గొల్లా పద్ధతులను చిత్రిస్తూ ఎర్రపూలు, వెన్నెలదారులు వెలువడ్డాయి. విప్లవాన్ని అపహాస్యం చేసేకథ 'పనికిరాని పాలాలు' ఈ కథ భారతిలో అచ్చయింది. విప్లవాన్ని పూర్తిగా వ్యతిరేకించే కథ ఇది, జీవితంలో ఉండే సంఘర్షణ సాహిత్యంలో కూడ ఉంటుందని అందుకే అంటుంటారు.

విప్లవం అంటే కేవలం ఆర్థికానికి, రాజకీయానికి మాత్రమే పరిమితమయింది కాదు కదా. ప్రజాజీవితంలో పెనుమార్పులను తీసుకువచ్చేదే విప్లవం. జీవితంలో అన్ని రంగాలకు విప్లవం విస్తరిస్తుంది. జీవితానికి, సమాజానికి అద్దంపట్టే సాహిత్యం కూడ విప్లవంతో పెనవేసుకుని ఉంటుంది. ఆ మాటకొస్తే శ్రీకాకుళ విప్లవ పోరాటం భాషాభివృద్ధికి కూడ ఎనలేని దోహదం చేసింది. చీకటికోణాల్లో ఉన్న గిరిజన జీవితాల్లో విప్లవ సూర్యుడి కిరణాలు చొచ్చుకుపోయాయి. తెలుగు భాషను

ప్రజల భాషగాచేయపోరిన గిడుగుపిడుగు అలనాడు సవరభాషకు లిపిని చేకూర్చ దానికి బండెడు కృషిచేశాడు. ఈసంగతి మనందరకు తెలిసిందే. కాని ఆయన కృషి సొంతం ఫలించలా. తెల్లవారి అడుగుజాడల్లో నడచిన మన నల్ల దొరలకు ప్రజా జీవితాలు, ప్రజల భాష, సాహిత్యం, సంస్కృతి అక్కర్లా. వీటిని వారు ఒక్క నాటికి పట్టించుకోరు. వలస ప్రభువుల పాలనా పద్ధతులనే మన కాంగ్రెసువారు మక్కీకిమక్కీ అనుసరిస్తున్నారు. ప్రజలమౌలిక సమస్యలు- జాతి, భాష, సంస్కృతి ఏమీ పరిష్కారం కాలేదు. నూతన ప్రజాస్వామిక విప్లవ విజయంలోనే ఈసమస్యలు పరిష్కారం కాగలవు. కనుకనే మనదేశం ఎజెండాలోకి నూతన ప్రజాస్వామిక విప్లవం చోటు చేసుకుంది. ఇందుకు ఒక ఉదాహరణ శ్రీకాకుళ విప్లవోద్యమంలోనే మనకు దొరుకుతుంది. 1967 అక్టోబరు 31న మొండెంఖల్‌లో (పార్వతీపురం తాలుకా) మొదటి గిరిజన మహాసభ జరిగింది. మీటింగు సంరంభం చూసి స్థానిక భూస్వాముల కళ్ళల్లో నిప్పులు పోసుకున్నారు. ఎలాగయినా ఆ మీటింగుని దెబ్బతీయాలని వాళ్ళు మాటుకాసి కోరన్న, మంగన్నలను కాల్చి చంపారు. శ్రీకాకుళపోరాటంలో తొలి అమరవీరులు వీళ్ళు మంగన్న శవం నడిరోడ్డుపై పడిఉంది. అతని ఇంటిలో చిన్న అగ్గిపెట్టెలో గిరిజన సంఘం జెండా పెట్టిఉంది. అగ్గిపెట్టెతోపాటు ఒకటో తరగతి పుస్తకం, పలక, బలపంకూడా ఉన్నాయి. గిరిజనులలో పెరుగుతున్న చైతన్యానికి, విద్యాభిలాషకి ఇవి చిహ్నాలుగా మిగిలిపోయాయి. జీవితంలో అన్ని రంగాలకు అలముకుంటుంది ఈ విప్లవం, దేనికది విడివిడిగా ఉండదు. విప్లవం చారిత్రిక అవసరం, సామాజిక శక్తులు చొరవతో విప్లవంలో పాల్గొని విజయం సాధిస్తాయి.

విరసానికి ఊపిరి, ఉత్తేజం శ్రీకాకుళపోరాటం. ఈ పోరాటం గురించి అవగాహన, ఆసక్తి లేకుండా నేటి విప్లవ సాహిత్యాన్ని అంచనా వేయడం అన్యాయం.

విప్లవాలు సుదీర్ఘ సాయుధ ప్రయాణాలు
రాత్రితో రాజీ లేకపోవడమే విప్లవం
లక్ష నక్షత్రాలు రాలందే
ఉజ్వల ఉదయం ప్రవహించదు.

విప్లవ చైతన్యం సాహిత్యానికి వెలుగు దారులేస్తుంది. విప్లవదశగా పయనించి నపుడే సాహిత్యానికి నిజమైన చేవచేకూరుతుంది. శ్రీకాకుళపోరాటం తెలుగు సాహిత్యానికి, ముఖ్యంగా తెలుగు కవిత్వానికి గొప్ప సేవచేసింది.

ఐరావతం*

## రాళ్ళెత్తిన కూలీలెవ్వరు?

అది ఢిల్లీమహానగరంలో కనాట్ప్లేస్‌లో ఓ పెద్దపార్కు. సమయం సాయం కాలం. ఎక్కడినుండో ఓ బృందం అకస్మాత్తుగావచ్చి ఓ వీధినాటకం వేయడం మొదలుపెట్టారు.

హో అప్పు అగయా
హో అప్పు భాగయా....
హై అప్పా అప్పు సబ్ సెనిరాలా
దిఖ్‌లాయెగా ఖేల్ యే ఆలా

'అప్పు' భారతప్రభుత్వం జరుపుతున్న తొమ్మిదవ ఆసియాడ్ క్రీడోత్సవాలకు గుర్తుగా ఎంచుకున్న ఏనుగుపిల్ల. ఈ పిల్లఏనుగు చూపించదలచుకున్న ఆటలవెనకాల కోట్లాదిరూపాయల ఖర్చుఉంది. వేలాదికార్మికుల కన్నీటికథఉంది. అకథే ఈ వీధి నాటకం - సఫేద్అప్పు - తెల్లఏనుగు.

ఈ ఆసియాడ్‌క్రీడలు ఆసియాదేశాలు నాలుగేళ్ళకోసారి జరుపుకునే మినీ ఒలింపిక్ ఆటల్లాంటివి. ఇవి మొదలవడం 1951లో భారతదేశంలోనే మొదలయ్యాయి. మళ్ళీ తొమ్మిదో ఆసియాడ్ క్రీడలు భారతదేశంలోనే జరగాలనే నిర్ణయం 1978లో జనతాప్రభుత్వమే తీసుకుంది. ఆ నిర్ణయాన్ని వ్యతిరేకిస్తూ మధ్యలోవచ్చిన చరణ్ సింగ్ మధ్యంతర ప్రభుత్వం గొడవచేసినా ఇందిరాగాంధీ రాకతో తిరిగి పని మొదలయింది. ముప్పైరెండు దేశాలమధ్య జరిగే ఈక్రీడలకి ప్రభుత్వ అంచనాలప్రకారమే 350 కోట్ల రూపాయలఖర్చవుతోంది. అయితే అవినీతిని మినహాయించి అన్నిరకాల ఖర్చూకలిపితే వెయ్యికోట్లు దాటుతుందని అనధికారఅంచనా. ఈ క్రీడలకవసరమైన స్టేడియంలు, హోటళ్ళు, వంతెనలు వగైరాలు నిర్మించడానికి వేలాది కాంట్రాక్ట్‌లేబర్ ప్రభుత్వానికవసరమయ్యారు. వాళ్ళంతా ఎక్కడ్నుండివచ్చారు, వసతిసౌకర్యాలులేని మహానగరంలో వలసకొచ్చిన ఈ కార్మికులెలాజీవిస్తారు; వగైరా ప్రాథమిక ప్రశ్నలు మన పార్లమెంటు సభ్యులకిపట్టవు.

---

* white elephant అనే వ్యక్తీకరణని ఇంగ్లీషులో అనవసరంగా జరిగే దుబారాఖర్చును సూచించడానికి వాడుతుంటారు. 'ఇంటిముందర ఏనుగును కట్టేసుకున్నట్లు' అని తెలుగులోకూడ వాడుకవుంది.

నాటకం రెండోదృశ్యంలో చూపించినట్టు వాళ్ళు చిన్నచిన్నవిషయాలపై పెద్ద పెద్ద హంగామాలుచేయడం, ఒకళ్ళనొకళ్ళు తిట్టుకోవడం, స్పీకర్ రికార్డుచేయొద్దని ఆదేశించడం మొదలైన సర్కస్‌పనులకే పరిమితమైఉంటారు.

ఇన్‌కేసె ఆంఖ్ మస్త్‌హై నషేపె లాల్ లాల్
యె సోరహేహై దేశ్‌మె భారహేహై విదేశ్‌మె
యె అప్నేకర్ణధార్‌హై, అప్నె కర్ణధార్‌హై

మన ఈ విధినిర్ణేతలు ఏసియాడ్ క్రీడల్లో ఎవరు, ఏరకంగా, ఎంతలాభం సంపాదిద్దామనే ప్రయత్నంలో మునిగిఉన్నారు. ఢిల్లీలో ఇప్పటికున్న ఫైవ్‌స్టార్ హోటళ్ళుకాక ఈ క్రీడలపేరుతో మరోఏడు ఫైవ్‌స్టార్ హోటళ్ళు వెలుస్తున్నాయి. నాలుగు పెద్దస్టేడియంలు, ఆరు ఫ్లైఓవర్‌లుకూడా నిర్మాణంఅయ్యాయి. ఇక ఈ ఉత్స వాల సందర్భంలో వివిధరకాలవస్తువులు సరఫరాచేయడానికి పెద్దపెద్ద కంపెనీలు ఒక దానితో ఒకటి పోటీపడి అధికారులకి లంచాలిచ్చి కాంట్రాక్టుతీసుకున్నాయి. ప్రైవేట్ కంపెనీలకు, ప్రభుత్వాధికారులకు, రాజకీయనాయకులకు మధ్యజరిగిన అవినీతి కథే ఏషియాడ్ (నాటకంలో మూడోదృశ్యం.)

దేశంలో తినడానికి సరైన తిండి తాగడానికి నీళ్ళు సంగతటుంచి కనీసం క్రీడల పరిస్థితిమాత్రమే చూసినా వేలాదిపాఠశాలల్లో ఆడుకోవడానికొద్దు, పాఠాలుచెప్పు కోవడానికే సరైన స్థలం లేదు. మన ప్రణాళికలు వేసేవాళ్ళకి ఈ విషయం తట్టదు, తట్టినా అందుకు వాళ్ళదగ్గర డబ్బుఉండదు. కాని ఏషియాడ్ క్రీడల్లో స్కోరుబోర్డు మాత్రం తొంభైలక్షల రూపాయల విదేశీమారకద్రవ్యం ఖర్చుపెట్టి ప్రభుత్వం దిగు మతి చేసుకుంది. ప్రజలగురించి పట్టించుకోకుండా ప్రణాళికలు వేయడమే మన ప్లానింగ్ కమిషన్‌పని.

హమ్ యోజనాబనానెవాలె యోజనా బనాయింగే
కభీ రుకేనా కభీథకేనా ఆగే బఢ్‌తే జాయే
.... .... .... .... .... ... .... ....
లోగోంకే మన్ బహలానే హమ్‌లాయేహైరంగీన్ దూరదర్శన్

అమాయకుల కళ్ళుమెరిపించడానికి రంగులకలలాంటి టీవీని ప్రవేశపెట్టగలిగిన వాళ్ళకి దగ్గరున్న పేదప్రజలే కనబడరు. కాని ఈ స్టేడియంలు, హోటళ్ళు, వంతె నలు కట్టడానికి కావలసిందివాళ్ళే.

ఏషియాడ్ క్రీడలకోసం ఢిల్లీకి లక్ష ఇరవైఐదువేలమంది కార్మికులు తరలి వచ్చారు. వీళ్ళల్లో అధికభాగం ఒరిస్సాలోని గంజాం, కోరాపుట్, మయూర్‌భంజ్, మధ్యప్రదేశ్‌లోని చత్తీస్‌ఘడ్, బెంగాల్‌లోని సంతాల్, బీహార్‌లోని ఛోటానాగపూర్ జిల్లాలనుంచి వచ్చారు. పాతగుడ్డలతో కట్టిన చిన్న చిన్న గుడారాల్లో నగరంమొఖం మీద రాచపుండులా మొలిచిన మురికివాడల్లో వాళ్ళజీవనం. అక్కడ మంచినీటి సౌకర్యాలు, పాయిఖానాలు ఊహించడంకూడా కష్టం. వీళ్ళందరినీ ఇంటికింతనిచెప్పి ఇచ్చి తీసుకొచ్చినవాళ్ళు లేబర్‌కాంట్రాక్టర్లు, వాళ్ళజమేదార్లు. వీళ్ళజేబుల్లోకే కార్మికులకు చట్టప్రకారం ఇవ్వవలసిన కనీసవేతనంలో సగభాగంపోతుంది. ఐదారేళ్ళ పిల్లల నుండి పండుముసలివాళ్ళదాకా వాళ్ళంతా ఇక్కడి భవననిర్మాణ స్థలాల్లో కట్టుబానిసలు. వీళ్ళపరిస్థితిని మొట్టమొదట వెలుగులోకి తీసుకొచ్చింది ఢిల్లీ పియుడిఆర్.

ఓ తాజ్ బనానేవాలే
ఓ కుతుబ్‌కొ ఘడ్‌నేవాలే
ఫిర్ దేశ్‌నె తుజేపుకారా
బనాదే హోటల్ పాంచ్‌సితారా

పెద్దపెద్ద కట్టడాలునిర్మించిన ఈ కార్మికులకి కనీస రక్షణసౌకర్యాలులేవు. ఈ నిర్మాణాల్లో జరిగిన ప్రమాదాల్లో 120 మంది మరణించిఉంటారని ఒక అంచనా. ఈ ప్రమాదాలనీ, మరణాలనీ పత్రికలవాళ్ళ కళ్ళబడకుండా కట్టుదిట్టమైన ఏర్పాట్లు చేసుకునే ప్రభుత్వం, అది నియమించిన కంట్రాక్టర్లు సంవత్సరంపైగా పనిసాగించారు. (నాటకంలో ఆరోదృశ్యం)

ఇంతచేసి, ఈ క్రీడల్లోపాల్గొనే క్రీడాకారులకికూడా సరైనసౌకర్యాలు లేనేలేవు. ఎంపికల్లో అవకతవకల సంగతటుంచి, భారతదేశం తరఫునపాల్గొనే ఆటగాళ్ళందరూ తమఖర్చులు తామేభరించుకోవాలని ప్రభుత్వం ఒకనియమం పెట్టింది. ఆఖరికి అందులోకొందరు ఆమరణ నిరాహారదీక్షకు పూనుకుంటేగాని వాళ్ళకి ఉండవలసిన సౌకర్యాలు వాళ్ళకుదక్కలేదు. (నాటకంలో ఏడోదృశ్యం)

ఎనిమిదిదృశ్యాల ఈ హిందీ వీధినాటకంపేరు 'సఫేద్‌అప్పు'. (ప్రస్తుతం ఇది విశాఖపట్నంలో తెలుగులోకూడా ప్రదర్శింపబడుతోంది). ఇది వేసినవాళ్ళు ఆవాన్ నాట్యమంచ్‌పేరుతో కొత్తగా ఏర్పడినఒక నాటకబృందం. ఈ నాటకాన్ని వాళ్ళ

విద్యాలయాల్లో, ఫ్యాక్టరీల్లో, ఆస్పత్రుల్లో, జనసమ్మర్థమైన చౌరస్తాలో అనేకచోట్ల ప్రదర్శించి సంచలనంసృష్టించారు అసలు ఈవీధినాటకం ఒకవిచిత్రమైన ప్రక్రియ. ఇది రంగస్థలంమీదజరిగే లిఖితనాటకాలకంటె గ్రామాల్లోజరిగే జానపదకళారూపాల మౌఖిక సాంప్రదాయానికే దగ్గర. ఈరకం నాటకాల్లో ప్రత్యేకించి కథంటూఏమీ ఉండదు. ఒక దృశ్యంనుండి మరోదృశ్యం పాటలసహాయంతో మారుతూ ప్రేక్షకుల్ని ఆకట్టుకుంటుంది. సూటైనభాషలో విషయాల్నిచెప్తూ వాళ్ళ అనుభూతుల్ని తనతో తీసుకువెళ్తుంది. దీనికి వేషధారణ, రంగాలంకరణ, లైట్లులాంటి హంగులేమీ ఉండవు. ఈ నాటకం చూడడానికి ప్రేక్షకులురారు, ఈ నాటకమే ప్రేక్షకుల్ని వెతుక్కుంటూ వెళ్తుంది.

ముప్పావుగంటసేపుసాగే ఈ 'సఫేద్అప్పు' నాటకం ఆఖరిదృశ్యంలో పాత్రధారు లందరూ ఒకళ్ళమీదికి ఒకళ్ళువంగి ఒక అర్ధవృత్తాకార వంతెననిర్మిస్తారు. వాళ్ళ మీదికి ఏషియాడ్ ఆటలుచూడడానికివచ్చిన ఓ విదేశస్తుడు ఎక్కినిలబడి, ప్రపంచంలో కెల్లా పెద్దప్రజాస్వామ్యం సాధించిన ప్రగతిగురించి ఆశ్చర్యపడుతుంటాడు. వంతెన కింద జీవాలు నెమ్మదిగా దీర్ఘంగా తమగొంతు వినిపిస్తుంటాయి.

ఓ తాజ్ బనానే వాలే
ఓ కుతుబ్‌కో ఘడ్‌నే వాలే
నదియా భీ అప్‌నా రాస్తాబదల్‌తీ
హవా భీ అప్‌నీ రుత్ బదల్‌తీ
తుమ్ బైటా చుప్ చాప్ క్యోం?
అబ్ బైటా చుప్ చాప్ క్యోం?

---

# తీర్పు

ప్రశ్నకుప్రశ్న ఎప్పుడూ సమాధానంకాదు. ఐనా ఎక్కడైనా ఓ అక్రమం జరిగి, దాని గురించి ఎవరోఒకరు ప్రశ్నించినప్పుడల్లా 'నువ్వెవడివి అడగడానికి', 'నీకేంహక్కుంది అడగడానికి'లాంటి ప్రశ్నలు మనంవింటూనే ఉంటాం. ఆ అక్రమాన్ని సరిచేయడం, అది జరిగినందుకు సంజాయిషీఇవ్వడం, నేరస్తులనుశిక్షించడం లాంటి చర్యలస్థానంలో ఎదురుప్రశ్న అడగడం సర్వసాధారణమైపోయింది. నిత్య జీవితంలో మనకెదురయ్యే ఈ తత్వమే మన న్యాయశాస్త్రానికి కూడాఉంది. బ్రిటీష్ (ఆంగ్లో-సాక్సన్) న్యాయశాస్త్రప్రకారం ఎవరికి అన్యాయంజరిగిందో వాళ్ళుమాత్రమే న్యాయస్థానానికి ఫిర్యాదు చేసుకోవాలి. మనం పుక్కిటికిపుక్కి అనుకరించిన ఈన్యాయ శాస్త్రం ధోరణి కర్మసిద్ధాంతానికి నెలవయిన హిందూ ఆలోచనాస్రవంతిలో చక్కగా ఇమిడిపోయింది. దీన్ని LOCUS STANDI (ఫిర్యాదిస్థానం) అంటారు. ఈ అంశానికి సంబంధించి ఈమధ్యకొన్ని ఆసక్తికరమయిన పరిణామాలుజరిగాయి. ఏసియాడ్ ఆటల నిర్మాణకార్యక్రమాల్లో పనిచేస్తున్న కూలీలతరపున ఢిల్లీ పీపుల్స్ యూనియన్ ఫర్ డెమోక్రాటిక్ రైట్స్ (పియుడిఆర్) సుప్రీంకోర్టులో దాఖలాచేసిన పిటిషన్‌పై సుప్రీంకోర్టు ఒక ముఖ్యమయిన తీర్పుని ప్రకటించింది. ఈ తీర్పులో పియుడిఆర్ 'ఫిర్యాదిస్థానం' గురించి ప్రభుత్వ అభ్యంతరాలను కోర్టు తోసిపుచ్చింది. ఈ తీర్పు బాల్యావస్థలోఉన్న పౌరహక్కుల ఉద్యమచరిత్రలో ఒక మైలురాయి.

పియుడిఆర్ ఏసియాడ్ ఆటలలో పనిచేస్తున్న కూలీలస్థితిగతులపై 1981 ఆగస్ట్‌లో ఒకనివేదికను విడుదలచేసింది. (ఈ నివేదిక సృజన నవంబరు, 81 సంచికలో వచ్చింది.) ఈ నివేదికనాధారంచేసుకొని పియుడిఆర్ సెప్టెంబర్, 81 లో సుప్రీం కోర్టులో తన రిట్‌పిటీషన్‌ను దాఖలాచేసింది. భారతప్రభుత్వం, అది నియమించిన కాంట్రాక్టర్లు ఏసియాడ్ ఆటలనిర్మాణంలో పనిచేస్తున్న కాంట్రాక్టు కూలీలవిషయంలో కార్మికచట్టాలని ఉల్లంఘిస్తున్నాయని పియుడిఆర్ ఆరోపణ. కనీసవేతనచట్టం, సమాన వేతనచట్టం (స్త్రీ, పురుషులకు), బాలకార్మికచట్టం, అంతర్‌రాష్ట్రీల వలస కార్మికుల చట్టం, కాంట్రాక్ట్ కార్మికుల (రద్దు) చట్టం, వెట్టిచాకిరి (రద్దు) చట్టం మొదలయిన ఈ ఆరు కార్మికచట్టాలని ఉల్లంఘిస్తున్నారని పియుడిఆర్ కేంద్రప్రభుత్వంమీద, ఢిల్లీ అభివృద్ధిసంస్థ, ఢిల్లీ పురపాలకసంఘంమీద ఈ కేసుని దాఖలాచేసింది.

సంవత్సరంపైగా సాగిన ఈ కేసులో మొదటి ఎనిమిదినెలలు పియుడిఆర్ ఫిర్యాదిస్థానాన్ని (Locus Standi) సవాల్‌చేస్తూ ప్రభుత్వం చేసిన వాదనలమీదే

సాగింది. ఆ ఏడుచట్టాలు ఉల్లంఘింపబడ్తున్నాయా, లేదా అనేది వేరే అంశం అని, అసలు అందులో బాధితులెవ్వరూకాక, కేవలం ఒక ప్రజాస్వామికహక్కుల సంఘమయిన పియుడిఆర్‌కు ఈ విషయంపై ఫిర్యాదును దాఖలాచేసే హక్కులేదనదే ప్రభుత్వ వాదనలో సారాంశం. ఈలోగా సుప్రీంకోర్టు తానే ఒక నిజనిర్ధారణ బృందాన్ని నియమించింది. ఆ బృందం తన నివేదికల్ని మే 1982 లో సుప్రీంకోర్టుకు అందచేసింది. చివరికి ప్రభుత్వంపై పియుడిఆర్ ఆరోపణలన్నీ వాస్తవాలేనని సుప్రీంకోర్టు సెప్టెంబరు నెలలో తన తీర్పుపూర్తి పాఠాన్ని విడుదల చేసింది.

సంచలనం సృష్టించిన ఈ తీర్పులో ఏడు ప్రధానాంశాలున్నాయి. మొదటిది ప్రాథమికహక్కుల గురించి. కొన్ని ప్రత్యేకమయిన పరిస్థితులలో ఆర్థిక చట్టాలు అమలుపరచక పోవడం కూడా ప్రాథమికహక్కుల ఉల్లంఘనకిందే వస్తుందని ఈ తీర్పు పేర్కొంది. (ఆర్టికల్ 19(ఎ) అని రాజ్యాంగంలో పొందుపర్చబడిన హక్కులలో ప్రజల ఆర్థిక జీవనానికి, వాళ్ళ ప్రజాస్వామిక హక్కులకు సంబంధించిన వ్యవహారాలేవిలేవు. ఈ 19(ఎ)నే భారత రాజ్యాంగంలో ఉన్న మౌలిక (లేదా ప్రాథమిక) హక్కులుగా మన లిబరల్ మేధావులు చెప్తుంటారు.) వలస కార్మికచట్టం, కాంట్రాక్ట్ కూలీలచట్టం అమలుజరుగుతున్న తీర్పుపై సుప్రీంకోర్టు తన నిరసనను తెలియజేసింది. బాలకార్మికచట్టాన్ని విస్తృతపరచాలని కేంద్రప్రభుత్వానికి సూచించింది. అన్నిటికి మించి తన చట్టాన్ని తానేగౌరవించుకోలేని ప్రభుత్వవైఖరిని తీవ్రంగా గర్హించింది. ఈ ఏసియాడ్ ఆటల నిర్మాణంలోఉన్న లక్షకుపై అయిదువేల మందికి కనీసవేతనం, ఆరోగ్య. వసతిసౌకర్యాలు, పిల్లలకు, స్త్రీలకు ప్రత్యేక సౌకర్యాలు కలుగజేయాలని ఆదేశించింది. ఈ చట్టాల్ని పాటించని కాంట్రాక్టర్లపై చర్యతీసుకోవాలని ప్రభుత్వాన్ని ఆదేశించడమేకాక, ఆ రకం కాంట్రాక్టర్లపై పెట్టిన కేసులను త్వరితంగా పూర్తి చేసి తగిన శిక్షలు విధించాలని కిందికోర్టులను కోరింది.

అయితే ఈ తీర్పులో ముఖ్యాంశమల్లా ఏసియాడ్ కూలీల తరఫున పిటిషన్ దాఖలాచేసే పియుడిఆర్ హక్కుని గుర్తించి, గౌరవిస్తూ చేసిన ప్రకటనే (ఈ కేసుని దాఖలాచేసి లక్షలాది కార్మికుల స్థితిగతుల్ని తమ ముందుకు తీసుకువచ్చినందుకు తీర్పు ఇచ్చిన న్యాయమూర్తులు తీర్పులోనే పియుడిఆర్‌కు ప్రత్యేకాభినందనలు తెలియజేసారు.) చెప్పుకోదగినంత దారిద్ర్యమూ, నిరక్షరాస్యత, అజ్ఞానమూఉంది. ఒక ప్రత్యేక సాంఘికార్థిక పరిస్థితి అమలయ్యేసమాజంలో పేదప్రజలకి న్యాయస్థానాలు దూరంగామాత్రమే మిగిలిపోతున్నప్పుడు, ఇంకా బాధితులుమాత్రమే ఫిర్యాదుచేసు

కోవాలనే ఆంగ్లో-సాక్సన్ న్యాయశాస్త్రానికి కట్టుబడి ఉండటమంటే పేదలకు న్యాయం నిరాకరించడమేనని ఈ తీర్పు ప్రకటించింది. ఈ తీర్పుప్రకారం అన్యాయానికి గురైనవారు మాత్రమేకాక ఎవరైనా తమకుతెలిసిన అన్యాయంగురించి కోర్టు కెక్కవచ్చును.

అందుకే ఈ తీర్పు న్యాయస్థానాల్లోనూ, న్యాయవాదుల సంఘాల్లోనూ, పార్లమెంటులోనూ, పత్రికలలోనూ పెద్దసంచలనాన్ని సృష్టించింది. సుప్రీంకోర్టు సూచనలమేరకు బాలకార్మికచట్టాన్ని సవరించవల్సిందిగా అన్ని రాష్ట్రప్రభుత్వాలని కేంద్రప్రభుత్వం ఆదేశించింది. పౌరహక్కుల సంఘాలేకాక, కార్మికసంఘాలు, విద్యార్థిసంఘాలు, ఇతర వృత్తిసంఘాలు ఈతీర్పుతో ఒక కొత్తఆయుధాన్ని సాధించాయి. ఇటీవల హైదరాబాద్ నగరంలో కట్నంకోసం (ఆత్మ) హత్యచేయబడ్డ విమలఅనేయువతి గురించి స్త్రీ శక్తి సంఘటన్, 'సహేలీ' సహాయంతో సుప్రీం కోర్టులో వేసిన పిటీషన్ ఈ తీర్పుఫలితమే.

1981 సెప్టెంబర్ ఎనిమిదవతేదిన వేసిన ఈపిటీషన్‌పై, లక్ష ఇరవయి అయిదువేలమంది కూలీలకు ప్రయోజనాన్ని కలిగించే ఈ తీర్పుని సుప్రీంకోర్టు 1982 సెప్టెంబర్ 18వ తేదీన ప్రకటించింది. కాని సెప్టెంబర్ ఒకటవ తేదీనాటికే ఈ ఆటల నిర్మాణ కార్యక్రమంలో అత్యధికభాగం పూర్తయి సుమారు లక్షమంది వలస కార్మికులు తాము విడిచివచ్చిన కరువుప్రాంతాలకు తిరిగి వెళ్ళిపోయారు. ఈ తీర్పు తమకు చేసిన లాభంగురించి చెప్పడానికి వాళ్ళిప్పుడు ఎక్కడున్నారో !

---

లేఖ :

## పాలస్తీనా ప్రజా పోరాటం - కొన్ని సమస్యలు

అయ్యా, శ్రీ బాలగోపాల్ పాలస్తీనా ప్రజాపోరాటంపై రాసినవ్యాసం అనేక వివరాలతో పాఠకుడ్ని ముంచెత్తుతుంది. అలాగేపాలస్తీనా ప్రజలకడగళ్ళను, ఇజ్రాయిల్ దురాక్రమణతత్వాన్ని చక్కగా చిత్రించి పాఠకుల్లో పాలస్తీనా ప్రవాసులపట్ల సానుభూతి రేకెత్తిస్తుంది. అయితే అందులోకొన్ని ముఖ్యమైన లోపాలు వున్నాయి. బహుశా అవి బాలగోపాల్‌గారు ఉద్దేశ్యపూర్వకంగా చేసినవే అనిపిస్తుందికూడ.

మొదటిది : ఇజ్రాయిల్ రాజ్యం ఏర్పడేంతవరకు సాగినచరిత్రను చిత్రీకరించడంలో అరబ్బులదే అంతాకరెక్టు, యూదులది అంతాతప్పేనన్నట్లు వర్ణించారు. ఇది సమంజసంకాదు. తమసంఖ్యాబలం చూచుకుని విర్రపీగుతూ ప్రపంచప్రజల అభిమతాల్ని (యూదులకు ఒక నివాసభూమి కల్పించాలనే) కాలరాసి, అప్పుడేఏర్పడిన ఇజ్రాయిల్‌పై యుద్ధంప్రకటించడంద్వారా అరబ్బులే తమవినాశాన్ని తామే కొని తెచ్చుకున్నారు.

రెండు : ఐక్యరాజ్యసమితిలో ఇజ్రాయిల్‌ను ఏర్పరచాలని, అందుకని పాలస్తీనాను విభజించాలనే తీర్మానాన్ని అమెరికాయేగాక అప్పటి స్టాలిన్ నాయకత్వంలోని రష్యాకూడ బలపరచింది. ఆ తర్వాత స్టాలిన్ నాయకత్వంలోను, స్టాలిన్ అనంతర కాలంలోనుకూడ రష్యా ఇజ్రాయిల్‌తో బహుకాలం దౌత్యసంబంధాలు పెట్టుకున్నది. అంటే ఇజ్రాయిల్ అస్తిత్వాన్ని గుర్తించిందన్నమాట. తనదృష్టిలో స్టాలిన్‌కు ఎలాంటి మచ్చరాకూడదనుకున్నాడేమో, బాలగోపాల్ ఈ అంశాన్ని దాటవేసారు.

మూడు : 1948 తర్వాత పాలస్తీనాలోని అనేకప్రాంతాలు అరబ్బురాజ్యాల (జోర్డాన్, సిరియా, ఈజిప్టు) చేతుల్లోవున్నా అవిఎన్నడూ ఆ ప్రాంతాల్లోనైనా పాలస్తీనా ప్రజలకు ఒక రాజ్యంఏర్పరచాలని ప్రయత్నించలేదు.

నాలుగు : ఇజ్రాయిల్ తరపున యూదు మతోన్మాదం ఎలావున్నదో, అరబ్బుల తరపున (పాలస్తీనా ప్రగతివాదుల్ని మినహాయిస్తే) ముస్లిం మతోన్మాదంకూడ అంతకుతక్కువేమీ లేదు.

ఐదు : పాలస్తీనాలో వివిధ గెరిల్లాసంస్థల పుట్టుక, చరిత్రలగురించి వివరంగా చర్చించనేలేదు, (అయితే ఇది బాలగోపాల్‌గారి ఉద్దేశ్యపూర్వక లోపంకాదు.)

ఆరు : అరబ్బుప్రజలకు, పాలస్తీనాప్రజలకు సోవియట్ యూనియన్‌చేసిన చేస్తున్నసహాయం నాటికీ, నేటికీ ఎంతోఘనమైనదే. అందులో రష్యా భౌగోళిక

ప్రయోజనాలు ఇమిడివుండవచ్చుగాక (ఏదేశం పూర్తిగా నిస్వార్థసహాయం చేస్తున్నది?) అయినా- నిజమైన సానుభూతి, సంవేదనలుకూడ యిమిడివున్నాయి. ఇప్పటి సంక్షోభం లో 'రష్యా డాంబికాలు పలుకుతున్నదేగాని ఏమీ చేయడంలేదు.' అని వ్యాఖ్యానించ డం రాజకీయ, భౌగోళిక వాస్తవాలతో నిమిత్తంలేకుండా కేవల పెటీబూర్జువా ఆవే శంతో వోరుజారడమే. అసలు సోవియట్-సిరియాలకు సంధివున్నది నిజమే. మరి సిరియావాళ్ళు అర్థించకుండా సోవియెట్ ఎలా ప్రత్యక్షసహాయం చేయగలదు? ఇక సిరియావాళ్ళు లోలోన (పాలస్తీనా గెరిల్లాలు నాశనమవుతూంటే) సంతోషిస్తున్నా రాయే. వాళ్ళెందుకు ఇజ్రాయిల్‌తో యుద్ధం చేయబూనుకుంటారు? లెబనాన్‌లో సిరియాసేనలు యుద్ధంచేసాయంటే కేవలం ఆత్మరక్షణ పరిధివరకే, అదీ మెలకువగా సురక్షితస్థానాలకు జారుకున్నారుకూడ. మన ఇండియావాళ్ల PLOకు వైద్యసహాయం మందులూగట్రా పంపితే అవన్నీ, బీరుట్‌కు పంపకుండా సిరియా ప్రభుత్వం ద్వేషంతో ఆపివేసిందని మీకుతెలుసా? అలాగే రష్యాసహాయానికి, బ్రెజ్నెవ్ సంఘీ భావానికి ధన్యవాదాలుతెలుపుతూ అరాఫత్ చేసిన ప్రకటన గమనించారా?

ఏడు: ప్రపంచ విప్లవకేంద్రం చైనామాటేమిటి? ఎక్కడా ఎవరినీపల్లెత్తు మాట అన్నట్లు కనిపించదేం? రష్యాపై విరుచుకుపడ్డఆగ్రహం, చైనావిషయంలో జావకారిపోయిందేం?

ఎనిమిది: అమెరికా హేయమైన పాత్రగురించి, అరబ్బుదేశాలు అమెరికాతో కుమ్మక్కైన తీరుగురించి ఇంకా బాగావివరించాల్సింది. సరే ఇక పరిష్కారంసంగతి ఆలోచిద్దాం. ఇజ్రాయిల్ తన 'భద్రమైన సరిహద్దులకు' వెనక్కుమళ్ళాలని, ఆ భద్ర మైన సరిహద్దు'లేవో స్పష్టంగా నిర్వచించాలనేది ఒకవైపుఉంటే, మరోవైపున పాల స్తీనా అరబ్బులుకూడ ఇజ్రాయిల్ అస్తిత్వాన్ని గుర్తించాలి. తమకు ముఖ్యశత్రువు ఇంటిలోనే (అరబ్బు అభివృద్ధి నిరోధకుల్లో) వున్నాడని పాలస్తీనాప్రజలు గ్రహిం చాలి (బహుశా ఈపాటికి గ్రహించేవుంటారు). యూదు దురహంకారులపట్ల ధర్మ యుద్ధం కొనసాగిస్తూనే, వివిధఅరబ్బుదేశాల్లో నియంతృత్వాలను, రాచరికాలను కూల ద్రోయడానికి వారూ, అరబ్బు సామాన్యప్రజలు ప్రయత్నించాలి, ఆ ప్రయత్నాలకు ప్రపంచవ్యాప్తంగా ప్రగతివాదులంతా మద్దతునివ్వాలి. మనం (ఇండియా) కూడ, ఇజ్రాయిల్‌తో దౌత్యసంబంధాలు నెలకొల్పుకొని, ఒకవైపున పాలస్తీనా ప్రజాపోరా టాన్ని సమర్థిస్తూనే, మరోవైపున ఇజ్రాయిల్‌పై దౌత్యపరంగా ప్రభావం కలగ జేసేందుకుకూడ ప్రయత్నించాలి. లేదా కనీసం దౌత్యపరంగా తొలిసంబంధాలైనా ప్రారంభించాలి. పాలస్తీనా ప్రజలకు ఒకరాజ్యం ఏర్పడాలనేదిమాత్రం నిర్వివాదమే. అయితే అది ఇజ్రాయిల్ అస్తిత్వాన్ని నిరాకరించడంద్వారా మాత్రం సాధ్యంకాదు; సవ్యమూకాదు.

— మల్లిక్‌బాబు

జవాబు :

మల్లిక్‌బాబు ప్రస్తావించిన ఎనిమిదిపాయింట్లలో నాకు సమాధానం చెప్పవలసిన అవసరమున్నట్టు తోచినవాటికి సమాధానంచెప్తాను.

1. ఇదిచాలా అన్యాయమయిన ఆరోపణ. తమకంటే ధనవంతులు, బలవంతులు, తమదేశాన్ని దౌర్జన్యంగా ఆక్రమించుకొని, తమభూముల్ని కొనుక్కొని, తమ భూములనుండి తమనుగెంటేసి, జాతిదురహంకారాన్ని ప్రాతిపదికగాగల పరాయి రాజ్యాన్ని తమదేశంలో ఏర్పరచుకుంటే తామతిరగబడడం 'విద్రోహీగుడు' అయితే ఈ ప్రపంచ చరిత్రలో న్యాయమయిన పోరాటాలు ఏవయినాఉన్నాయా ?

2. ఇజ్రాయిల్ ఏర్పాటును స్టాలిన్ సమర్థించినమాట వాస్తవమే. ఒక్క స్టాలినేకాదు, యూరప్‌లోని అభ్యుదయశక్తులన్నీగూడ సమర్థించాయి. దీని వెనకున్న వాస్తవాన్ని గుర్తుంచుకుంటే ఆ సమర్థన ఆశ్చర్యంకలిగించదు. యూరప్‌లో చాలా బలంగావున్న యూదువ్యతిరేకతను ఎదుర్కొని దానిమీద పోరాటంజరిపినది అక్కడి కమ్యూనిస్టులు, ఇతర సోషలిస్టులు. యూదువ్యతిరేకతను సిద్ధాంతంగా గల నాజిజాన్ని చివరికంటా రాజీలేకుండా వ్యతిరేకించి పోరాడిందీ వీళ్ళే. ఇవ్వాళ ఫ్రాన్సులోనూ ఇటలీలోను కమ్యూనిస్టుపార్టీలకు పార్లమెంటరీ రంగంలో కొంత బలముందంటే దానికి కారణం అనాడు నాజిజానికీ ఫాసిజానికీ (వాటితోబాటు యూదువ్యతిరేకతకూ) వ్యతిరేకంగా ఆయాదేశాల్లో జరిగిన ప్రతిఘటన (resistance) పోరాటంలో కమ్యూనిస్టులు ముందుండడమే. కాబట్టే, యూదువ్యతిరేక నాజీఉన్మాదానికి తట్టుకోలేక యూదులు యూరప్‌వదిలి పాలస్తీనా పారిపోవడాన్ని ఈ అభ్యుదయ శక్తులన్నీ సమర్థించాయి. ఆనాడు స్పష్టంగా వీళ్ళకు అర్థంగాని విషయమేమిటంటే, యూదులకు అన్యాయం జరిగింది యూరప్‌లోకాగా దానికి పాలస్తీనా అరబ్బులు పరిహారం చెల్లించాల్సిరావడం, రెండవది, జియోనిజం ఆనాటికే సామ్రాజ్యవాదపు ఏజెంటు కావడం. ఈ విషయాలను స్పష్టంగా గుర్తించిన నాటినుండీ అభ్యుదయశక్తులన్నీ జియోనిజాన్ని వ్యతిరేకిస్తూ వచ్చాయి.

3. సిరియా ఈజిప్టులచేతిలో పాలస్తీనాలోని ముఖ్యప్రాంతాలు ఎన్నడూలేవు. (అసలు ఏప్రాంతాలయినా వున్నాయా అని నాకు అనుమానం) జోర్డాన్ చేతిలోమాత్రం కొంతకాలం జోర్డాన్ నదీపశ్చిమతీరం (పత్రికలలో West Bank అనే పేరుతో వ్యవహరించబడేది) వుండేది. దాన్నిగూడ కొద్ది కొద్దిగా ఇజ్రాయిల్ ఆక్రమిస్తూ

వస్తోంది. ఆ ఆక్రమణ పెరుగుదల ఇప్పటి యుద్ధపు ముఖ్యపర్యవసానాలలో ఒకటి. అయినా West Bankలో పాలస్తీనా ప్రజలకు నివాసం ఏర్పరచడాన్ని జోర్డాన్ కంటే పాలస్తీనా ప్రజలే ఎక్కువగా తిరస్కరిస్తున్నారు. ఇంతవరకూ ఈ మధ్యకాలంలో అవైఖరిమారే సూచనలు కనిపిస్తున్నాయి. వాళ్ల ఒప్పుకుంటే జోర్డాన్‌చేత అమెరికా బలవంతంగా ఒప్పిస్తుందనడంలో సందేహంలేదు. ఎందుకంటే ఆ పరిష్కారం ఇజ్రాయిల్‌కు కావలసిన 'భద్రత'నిస్తుంది.

6 సోవియట్ రష్యా పాలస్తీనా ప్రజలకు చేసిన సహాయం ఎంతఘనమయినదో మల్లిక్‌బాబు వివరించివుంటే బాగుండేది. ఘనమయినది కాదనడం 'రాజకీయ, భౌగోళిక వాస్తవాలతో' నిమిత్తం లేకుండ ఆవేశపడడం అన్నారు. బూర్జువా పత్రికా పరిభాషలో 'రాజకీయ భౌగోళిక వాస్తవాలు' అన్నది జాతీయస్వార్థానికి పర్యాయపదం. ఆ అర్థమే మల్లిక్‌బాబు ఉద్దేశ్యమయితే నాకు అభ్యంతరం లేదు. నేను చెప్పదల్చుకున్నదీ అదే. సోవియట్-సిరియా ఒప్పందం ఉన్నది నిజమేగాని 'సిరియా అర్థించకుండ సోవియట్ రష్యా ఎట్లా ప్రత్యక్షసహాయం చేయగలదు?' అని ప్రశ్నించడం అపారమయిన అమాయకత్వమే కావాలి. 1968 లో జకొస్లోవేకియా నుండి 1980 లో అఫ్ఘనిస్తాన్ వరకు ఒకళ్లు అర్థిస్తేనే 'ప్రత్యక్షసహాయం' చేసిందా సోవియట్ రష్యా?

7 చైనా 'ప్రపంచవిప్లవ కేంద్రం' అవునా కాదా అన్న చర్చ ఇక్కడ అప్రస్తుతం. అయినాకాకున్నా చైనా ఒకళ్ళకు చేయగల సాయంతక్కువ. చైనా రష్యా లాగా ప్రపంచ అగ్రరాజ్యాలలో ఒకటికాదు- పేదదేశాలలో ఒకటి. ఐక్యరాజ్య సమితిలో చేయగల మాటసహాయం చేస్తూనేవుంది.

మిగిలింది పరిష్కారం. అందులో ఒక అవగాహన, రెండుసలహాలువున్నాయి. పాలస్తీనా ప్రజల ప్రధానశత్రువు ఇంటనే వున్నాడని నేననుకోవడంలేదు. వాళ్ళ ప్రధానశత్రువు జియోనిజమే ననుకుంటున్నాను. రెండు సలహాలలో ఒకటి పాలస్తీనా ప్రజలకు, రెండవది భారత్‌సర్కార్‌కు ఇచ్చారు. ఐక్యరాజ్యసమితి కాగితపు పరిష్కారాలనే ఎవ్వరూ గౌరవించడం లేదు. ఇక నేనూ మల్లిక్‌బాబూ ఒప్పుకున్నా ఈ పరిష్కారానికి అంతకంటే విలువ ఉంటుందని నేననుకోవడంలేదు. ఆ గొడవేదో పాలస్తీనా ప్రజలకే వదిలేయవచ్చునను కుంటాను.

— కె. బాలగోపాల్

సంస్మరణ :

## బంగోరె

It is not my shirt
that I cast off today
But skin with my own hands

– ఖలీల్ జిబ్రాన్

ఈ కవిత్వచరణాలతో 'యూత్ కాంగ్రెస్' అని కొన్నాళ్ళు నడిచిన ఓ దౌర్భాగ్య పత్రికకు అద్భుతమైన సంపాదకత్వాన్ని నిర్వహించిన బంగోరె తన పాఠకులకు వీడ్కోలు చెప్పుకున్నాడు. ఆ పత్రిక సంపాదకత్వం అస్థిరమైన తన నలభై ఏళ్ళ జీవితంలో బంగోరె చేసిన అసంఖ్యాకమైన ఉద్యోగాల్లో ఒకటి. ఎప్పుడూ కుదురుగా ఒక్కచోట ఒక్క ఉద్యోగంకూడా చేయని విరామంలేని ఆయన జీవితంలో కూడా ఒక ఏకత్వం లేకుండాపోలేదు. అదే ఆయన పరిశోధనాతృష్ణ.

తెలుగుదేశంలో పరిశోధన ప్రస్తుతం నిలిచిపోయింది. ఈ శతాబ్ది మొదటి భాగంలో ప్రతివిషయంలోనూ మౌలికమైన పరిశోధనను మొదలుపెట్టిన మొదటితరం అగ్రగణ్యులని వదిలేస్తే సుమారు అన్ని రంగాలలోనూ ప్రస్తుత పరిశోధన ఈ స్థితికి చేరుకుంది. ఈలోగా మనకు విశ్వవిద్యాలయాలు వచ్చాయి. రాష్ట్రం ఏర్పడినప్పుడు ఉన్న రెండు విశ్వవిద్యాలయాలు ఇప్పుడు ఆరయ్యాయి. అకాడమీలు, భాషా సమితులు ఏర్పడ్డాయి. భారతీయ సామాజిక శాస్త్రపరిశోధనా మండలి భారతీయ చరిత్ర పరిశోధనా మండలి ఫోర్డ్ ఫౌండేషన్ రిసెర్చ్ గ్రాంటులు, రాక్ ఫెల్లర్ ఫౌండేషన్ అవార్డులు, కేంద్ర, రాష్ట్రప్రభుత్వాల ఆదరణ పెరిగి పరిశోధన పేరుతో కోట్లాది రూపాయలు నీళ్ళలా ప్రవహిస్తున్నాయి. ఈ వ్యవహారాలు నిర్వహించడానికి పెద్దపాలనా యంత్రాంగం ఒకటి రాక్షసిలా పెరిగి పరిశోధనలపై నిర్ణయాత్మకమైన అధికారాన్ని చెలాయిస్తోంది. ఈ యంత్రాంగంలో ఉన్న అధికారులతో వ్యక్తిగత పరిచయాలు, పైరవీలుచేయగల శక్తి ఉండడమే ఇవాళ పరిశోధకుడికుండవలసిన ప్రాథమిక అర్హత. మేధస్సు సంగతటుంచి కనీసం కష్టించి పనిచేయగల ఓపికకూడా లేనివాళ్ళు మేధావులుగా చలామణీకావడానికి ఈ పరిశోధనా వ్యాపారం ఒక సాధనం. ఈ పరిశోధన కాలేజీల్లో ముఖ్యంగా విశ్వవిద్యాలయాల్లో తాత్కాలిక లెక్చరర్లు పర్మనెంట్ కావడానికి, పర్మనెంట్ లెక్చరర్లు రీడర్లుకావడానికి రీడర్లు ప్రొఫెసర్లు కావడానికి- ఇవేవీకాకపోతే ఇతర విశ్వవిద్యాలయాలకో, విదేశాలకో పోవడానికి పనికొచ్చేసాధనం. వృత్తిలో పైకి, ఇంకా పైకిపోయే క్రమంలో ఉన్న పరమపద సోపానంలో నిచ్చెనమెట్లే మన పరిశోధనా ప్రాజెక్టులు.

బంగోరె ఈ పరిశోధనావృత్తి చట్రంలో ఇమడగల సహనం లేకుండానే, మరోవైపు ఆ ప్రాజెక్టులలోనే పనిచేస్తూ, ఒక ప్రాజెక్టునుండి మరో ప్రాజెక్టుకు మార్చబడుతూవచ్చిన విరామమెరుగని పరిశోధకుడు. ఆయనకున్న స్వభావం, దృక్పథం బంగోరెని ఈ చట్రాలలో ఇమడ్చలేకపోయాయి. పరిశోధన ఒక తీరనిదాహంగా ఆయన పడినశ్రమే విద్యాలయాల్లో జరుగుతున్న పరిశోధనపై ఆయనకు అసహనాన్ని కలగజేసింది. ఆ పరిశోధనలలో తృష్ణాలేదు, శ్రమాలేదు. ఉన్నదల్లా వృత్తివ్యాపార కాంక్షే. ఈ వైరుధ్యమే ఆయనను మేధస్సురీత్యా ఒంటరితనానికి గురిచేసింది. నిజానికి ఈ ఒంటరితనం ఆయన వ్యక్తిగత అనుభవం మాత్రమేకాదు ఈ విద్యావ్యాపార వ్యవస్థలో ఒక అనివార్యమైన సామాజికధోరణి. అయితే పరిశోధనలు చేయడానికి వేరే మార్గాలు సాధించుకోలేక ఆయన ఈ చట్రాలలోనే ఇమిడీ ఇమడక తన అన్వేషణ కొనసాగించాడు. కె. వి. రమణారెడ్డి మాటల్లో "అకడమిక్ అరణ్యవీధుల్లోకి హిట్ అండ్ రన్ ఎత్తుగడలతో లైట్నింగ్ రైడ్స్‌చేసే అక్షర అర్బన్ గెరిల్లా" బంగోరె.

'జమీన్‌రైతు' లో 'కూనిరాగాలు' శీర్షికలో నెల్లూరు ప్రాంతస్థానిక చరిత్ర, సుబ్రమణ్యభారతి 'చంద్రిక కథ', తెలుగులో జర్నలిజం తొలకరి జల్లులు 'బ్రౌన్ లేఖలు', బ్రౌన్ సేకరించిన తాతాచార్లకథలు, కన్యాశుల్కం మొదటి ముద్రణ ప్రతి, కడప జిల్లా ఊళ్ళపేర్లు, మాలపల్లి పై నిషేధాలు, వేమన పద్యాల్లో ప్రక్షిప్తాలు, సిఆర్ రెడ్డి రచనలు ఎన్నిటినో ఆయన తవ్వితీశాడు. మద్రాసు ఓరియంటల్ మాన్యుస్క్రిప్ట్స్ గ్రంథాలయంలోనో, ఢిల్లీ నేషనల్ ఆర్కైవ్స్ నేలమాళిగ గదుల్లోనో శవపేటికల్లో భద్రపరిచిన సమాచారాన్ని తవ్వితీసిన తెలుగు సాహిత్య పురాతత్వ శాస్త్ర పరిశోధకుడు బంగోరె.

పురాతత్వ శాస్త్ర పరిశోధన ఒక రకంగా చరిత్రకు పునాది. కనీసం గత ఎనిమిది శతాబ్దాల తెలుగు లిఖిత సాహిత్యచరిత్ర తీసుకున్నా ఇంకాఎన్నో అవశేషాలు పరిశోధకుల కళ్ళలోకి రాకుండానే మిగిలిపోయాయి. మన చరిత్రకారుల్లో ఈ ముడి సరుకుని తవ్వితీసే ఓపికఉన్నవాళ్ళు చాలతక్కువ. శాసనాల రాళ్ళలో, పాతగెజెటీర్లలో, లిఖితగ్రంథాల్లో అనేకానేకరూపాల్లో గతం మిగిల్చివెళ్ళిన ఎన్నో అవశేషాలు చరిత్రను తెలుసుకోవడానికి మనకున్న ఆధారాలు. ఈ ఆధారాలను వెతికితీసి, వాడుకోగల రూపంలో సమాచారాన్ని పొందుపరచడం చాల ప్రాథమికమైన పరిశోధన. బంగోరె చేసింది ఈరకమైన ప్రాథమిక పరిశోధన. అందుకే తెలుగు సాహిత్యానికి ఆయన చేసిన సేవ విలువైనసేవ. చరిత్రకారులకి పనికొచ్చే ఎంతో ముడిసరుకుని తానొక్కడే

తవ్వితీసి అందరికీ నిరపేక్షగా పంచిఇచ్చాడు. ఆయన చేసిన ఈ సేవను గుర్తించి, విమర్శనాత్మకంగా ప్రతిస్పందించిన వాళ్ళు చాలా తక్కువ. పురాతత్వశాస్త్ర పరిశోధనకు, చరిత్రకు తేడాని గుర్తించని మన విమర్శకులు, చరిత్రకారులు ఆ సంబంధాన్ని ఎప్పుడూ అర్థంచేసుకోప్రయత్నించలేదు. తెలుగు సాహిత్యంలో ఎంతమంది పేరొందిన విమర్శకులు, చరిత్రకారులు తెరవెనుక బంగోరె చేసిన పరిశోధనకు, శ్రమకు ఋణపడివున్నారు! అయితే బంగోరెకు ఈ పరిశోధనలు మార్గాలు కావు, గమ్యమే. అందుకే తనదంటూ ఒక చారిత్రిక దృక్పథాన్ని అలవరచుకోలేకపోయిన పురాతత్వశాస్త్ర పరిశోధకుడుగానే ఆయన మిగిలిపోయాడు.

మార్గాన్నే గమ్యంచేసుకున్న ఈ పరిశోధనా ప్రయాణికుణ్ని అస్థిరజీవితం, ఆందోళనా స్వభావం, విద్యాలయాలు కలుగజేసిన ఒంటరితనం చివరికి హిమాచల ప్రదేశ్‌లో సట్లెజ్ నదీతీరాన్ని చేర్చాయి. మేధస్సురీత్యా ఒంటరితనాన్ని, నిరాశావాదాన్ని భరించలేకపోతున్నానని తన ఆఖరిజాబులో రాసిపోయాడు.... Casting off the skin with his own hands. ఆయన ఆత్మహత్య చరిత్రకారులు పురాతత్వశాస్త్రవేత్తలకు చెప్పుకోకుండా మిగిలిపోయే కృతజ్ఞత.

— సురా

---

4వ పేజీ తరువాయి....

జేలర్ అయోమయస్థితిలో కపటబింకముతో తల నాడించాడు.

“తాగనుసార్!” గండయ్య నిర్భయంగా జవాబిచ్చాడు.

“ఒంటిగదిలో మూసేసి తర్వాత నావద్దకు తీసుకొనిరాండి. వాడికి మంచిగా బుద్ధిచెప్పితే రోగంకుదురుతుంది. గంజి తాగుతాడు. చదువుకున్నోళ్ళ సంగతి తెలుస్తుంది” అంటూ వెళ్ళిపోయాడు జేలరు.

[ఎమర్జెన్సీ చీకటి రోజుల్లో 1975 డిసెంబర్ 1న కామ్రేడ్స్ భూమయ్య, కిష్టాగౌడ్‌లను ఇందిరా వెంగళరావు ప్రభుత్వం ఉరితీసింది. 47 ఆగస్టు 15 తర్వాత ఉరిశిక్షకు గురిఅయిన మొదటి రాజకీయఖైదీలు వీళ్ళు. రాజకీయ ఖైదీల విషయంలోనే కాదు, భారతీయ శిక్షాస్మృతిలోనే ఉరిశిక్ష అనేది రద్దుచేయాలన్నది పౌర ప్రజాస్వామికహక్కుల ఉద్యమ దృక్పథం. కామ్రేడ్స్ భూమయ్య, కిష్టాగౌడ్‌ల ఉరిశిక్షకు పూర్వం సికిందరాబాదు జెయిల్లోనే కర్నూలుజిల్లాకు చెందిన రోశయ్య, పాపయ్యలను ఉరిదీసారు. ఇటీవలకాలంలో బిల్లా, రంగాలను ఉరితీసారు. 1952కు పూర్వమే వట్టికోట ఆళ్వారుస్వామిగారు రాసిన పైకథ ‘నేరస్తులను’ కూడ ఉరితీసే శిక్షాస్మృతి స్వభావాన్ని ప్రశ్నించింది. ఇంక రాజకీయ ప్రత్యర్థుల విషయంలో ఈ శిక్షాస్మృతిని అమలుచేయడం ఎంతనేరమో ఎంతఅనాగరికమో, ఎంత అప్రజాస్వామికమో వేరే

— సంపాదకుడు ]

## పుస్తకస్వీకారం

1. ఊరు నవల- అల్లం రాజయ్య, పి.బి.సి. ప్రచురణలు (మే 1982) 120 + viii పేజీలు, 1/8 డెమీ, నాలుగు రూపాయలు.

2 మెడికల్ గైడ్, డాక్టర్, క్రాంతిప్రచురణలు (జూన్ 1982) 118 + x పేజీలు, 1/8 డెమీ నాలుగురూపాయలు.

3 పంట, చైనాకథలు యే-జూ, పి బి సి. ప్రచురణలు (ఆగస్టు 1982) 168 పేజీలు 1/8 డెమీ ఆరురూపాయలు.

ఈ మూడు పుస్తకాలూ ప్రతులకు : పీస్ బుక్ సెంటర్, 4-5-421, సుల్తాన్ బజార్, హైదరాబాద్ 500 001

4. కటుంబరావు సాహిత్యం - మూడవ సంపుటం, సంపాదకుడు: కేతు విశ్వనాథరెడ్డి, విశాలాంధ్ర పబ్లిషింగ్‌హౌస్ (ఆగస్ట్ 1982), 396 + xxxii పేజీలు, 1/8 డెమీ, రు. 25-00 ప్రతులకు : విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్, చంద్రం బిల్డింగ్స్, విజయవాడ 520 004

5. చైనా-భారతమైత్రి సంక్షిప్తచరిత్ర చిన్ కే-మూ, అను : సహవాసి, భారత చైనా మిత్రమండలి ప్రచురణ (1982), 82 + viii పేజీలు, 1/8డెమీ, రు. 3-00 ప్రతులకు : 1. హైదరాబాద్ బుక్‌ట్రస్ట్, 3-6-694, హిమాయత్‌నగర్, హైదరాబాద్ 500 029. 2 నవోదయ పబ్లిషర్స్, ఏలూరురోడ్, విజయవాడ 520 002, 3. కొల్లిపర వెంకటేశ్వరరావు, 5/1 బ్రాడీపేట, గుంటూరు 522 002.

6. గుండెమంట - పాటలు - క్రాంతికిరణ్, (మే 1982) 48 + viii, 1/8 క్రౌన్ రూపాయిన్నర. ప్రతులకు: మైత్రిబుక్‌హౌస్, అబ్బీపేట, విజయవాడ 520 010.

7. పెట్టుబడి- కార్ల్ మార్క్స్ - మార్క్స్ రాసిన మూడు సంపుటాలకు జూలియన్ బొర్చార్డ్‌ట్ సంక్షిప్తీకరణ. తెలుగు సేత : ఇలగువ మల్లికార్జునశర్మ, మార్క్సిస్టు అధ్యయన వేదిక ప్రచురణ (సెప్టెంబర్ 1982) 262 + 30 + xiv పేజీలు, 1/4 క్రౌన్, సాదాప్రతి: 24 రూపాయలు, మేలుప్రతి 40 రూపాయలు.
ప్రతులకు: మార్క్సిస్టు అధ్యయన వేదిక, 6-3-1243/114, డి. సంజీవయ్యనగర్ హైదరాబాద్ 500 482.

---

45వ పేజీలో అచ్చయిన 'నాకుటుంబం' పరిచయంకింద వివరాలు అచ్చుకాలేదు. గమనించగలరు.

నాకుటుంబం నవల - టావ్‌చె-గ్ సృజనప్రచురణలు (ఏప్రిల్ 1982) 120 + xii పేజీలు, 1/8 డెమీ, నాలుగు రూపాయలు,
ప్రతులకు :

1. సృజన, హనుమకొండ, వరంగల్ 506 001.
2. పీస్ బుక్‌సెంటర్, 4-5-421, సుల్తాన్‌బజార్, హైదరాబాద్ 500 001.

---

